





# ఉప వేదాలు

ఆరోగ్యం

# వైద్యక శారీర శబ్దకోశము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100067564

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Ir ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వైద్యక
# శారీర శబ్దకోశము

( శరీరశాస్త్రమునకు సంబంధించిన ఆధునిక వైద్య పారిభాషిక పదములకు - సంస్కృతమున, తెలుగునగల ఆయుర్వేద పారిభాషిక పదములు, వాటి అర్థములుగల నిఘంటువు )


ఆయుర్వేద మహోపాధ్యాయ, ఆయుర్వేద భూషణ

**వేటూరి శంకరశాస్త్రి**

ఏ. ఎం. ఏ. సి.

ఆయుర్వేద వైద్యవిద్వాన్

**ముదిగొండ గోపాలరావు**

ఏ. ఆర్. ఏ. సి



**కమలా పబ్లికేషన్స్,**

చోడవరపు దేవరాజుగారి స్ట్రీట్

గవర్నర్‌పేట : : విజయవాడ-2

# తొలిపలుకు

శరీరం సర్వథా సర్వం
సర్వదా వేద యో భిషక్
ఆయుర్వేదం స కార్త్స్న్యేన
వేద లోకసుఖప్రదమ్.

చ. శా. అ. ౬ శ్లో 27

సృష్టికర్తయగు పరమాత్ముడు మానవులకు ప్రసాదించిన శరీరము, ఇంద్రియములు, మనస్సు, ఆత్మ, వీనితోకూడిన జీవితము విశిష్టమైనదీ, అద్భుతశక్తిసంపన్నమైనదీ అని విజ్ఞుల అభిప్రాయము. జంతుకోటిలో నెల్ల మానవశరీరమును నిట్టనిలువుగా నుండునట్లు సృష్టించుటలోనే ఆ విశిష్టమైన పరమార్థము గోచర మగుచున్నది. అచింత్యాద్భుతశక్తిసంపన్నమైన ఈశ్వరశక్తిని వినమ్రతతో నారాధించుటకు ఇంతకు మించిన సాధనము వేరొకటి లేదు.

శరీరములేనిది యేపనిని సాధించుటకు వీలులేదు. సర్వార్థసాధకమైన శరీరమునుగూర్చి ఆయుర్వేదాచార్యులు కూలంకషముగా చర్చించి కొన్ని సిద్ధాంతముల నేర్పరచినారు. ఈశ్వరుని సృష్టికంతకు శిరోభూషణమైనదీ, పురుషార్థచతుష్టయసాధకమైనదీ మానవశరీరమే యని ఆయుర్వేదశాస్త్రము ఉద్ఘోషించుచున్నది.

ప్రత్యక్షముగా చర్మచక్షువులకు గోచరమగు పంచభూతాత్మకమైన శరీరము, శీర్షాదిశరీరాంగములు, హృదయాద్యవయవములు, రసాది సప్తశరీరధాతువులు, వివిధములైన నాడులు, ధమనులు, సిరలు, స్రోతస్సులు మొదలైనవాని రచనావిధానము, ఆహారపచనము, ధాతుపరిణామము, ధాతుపోషణము, రక్తచంక్రమణము, సారకిట్టవిభాగము, మలమోచనము మొదలైన శరీరక్రియాకలాపములన్నీ సృష్టి యేనాడు ప్రారంభమైనదో ఆనాడే యేర్పడి మానవమేధకు అవగతమైనట్లు అథర్వణవేదమంత్రములనుబట్టి తెలియుచున్నది.

ఇవే గాక, చర్మచక్షువుల కగోచరమై, తపశ్చక్షువులకు, జ్ఞాన చక్షువులకుమాత్రమే అంతర్వీక్షణమున అవగతముకాగల సూక్ష్మమైన ఇంద్రియములు, త్రిగుణాత్మకమైన మనస్సు, పరమాత్మాంశమగు జీవాత్మ, మూలాధారాదిచక్రములు, నిర్వాణాదిపదములు, అన్నమయాదికోశములు, సూక్ష్మాదిశరీరములు, ప్రాణాదివాయువులు, వాని భేదములు, వీని మూలమున సంపాదింపదగిన అలౌకికశక్తులు - ఇవికూడా మానవప్రజ్ఞకు అవగతమైనట్లు వేదమంత్రములే చెప్పుచున్నవి. దర్శనములందును, ఉపనిషత్తులందును, పురాణములందును ఇందునుగూర్చిన విజ్ఞానము మిన్నగా నున్నది.

ఆయుర్వేదపరముగా జీవదేహధారియగు మానవుడే పురుషుడు. అట్టి పురుషునిగూర్చి 'పురుష విచయ' మను పేరుతో జీవాణువు మొదలు బ్రహ్మాండమువరకు దేహధారుల అవయవాంగప్రత్యంగవిభాగాదులగూర్చి ఆయుర్వేద గ్రంథకర్తలు విషయపరిజ్ఞానముతో సంపూర్ణముగా తమ గ్రంథములందు వివరించియున్నారు.

ఆయుర్వేద సంహితలలో పరిపుష్టముగానున్న 'పురుష * విచయము' అనే శరీరశాస్త్రము దేవభాషయగు సంస్కృతమున నుండుటచేత దానియందాసక్తి కలిగి, లక్ష్యలక్షణసహితముగా దానిని చదివేవారికే అది బోధపడుచున్నది. సంస్కృతభాష వచ్చినవారు దేశదౌర్భాగ్యవశమున ఇప్పుడు విరివిగా నుండకపోవుటచేతను, చిరకాలగతమైన ఆంగ్లేయుల పరిపాలనాప్రాభవము, ప్రోద్బలము మనమీద నింకను పనిచేయుచుండుటచేతను, విద్యాధికులేమి, విద్యార్థులేమి, ఆయుర్వేద విషయముల జోలికి పోజాలకున్నారు.

ఆంగ్లేయుల పాలనము అస్తమించిన తర్వాత ఇప్పుడిప్పుడు స్వభాషాభిమానము ప్రబలుచున్నది. పాఠశాలలలోను, కలాశాలలలోను వివిధ శాస్త్రవిషయముల నెల్ల దేశీయభాషలలోనే బోధింపవలెనను నభిలాష ప్రజలలో ప్రబలముగా కన్పట్టుచున్నది. వివిధశాస్త్ర విషయములు దేశభాషలలో బోధింపవలెనన్న ఆయాభాషలలో శాస్త్ర పారిభాషిక పదజాలము చాలినంతగా లేదని ఒక అపప్రథకూడ కలదు. అందువలన ప్రతి

---

* విచయః = శరీరస్య ప్రవిభాగేన జ్ఞాన మిత్యర్థః.

శాస్త్రవిషయమునను మన ప్రాచీన విజ్ఞానసంపద యెట్టిదో పరిశీలించుకొని, సంస్కృతభాషలోగల శాస్త్రీయ పారిభాషిక పదజాలము నంతను క్రోడీకరించి, వానికి ప్రాంతీయభాషలలోగల వాడుకపదములనుగూడ పరిచూచుకొని సమన్వయపరచుకొనుట విజ్ఞానవంతుల విధిగా నేర్పడినది. ఇప్పటి అవసరములను, పరిణామములనుగురించి అంతగా లేనివాటికి క్రొత్తపదములను పరాయిభాషలనుండి తీసికొని వాడవచ్చును. అట్లు కానిచో సరియగు నర్థము స్ఫురించునట్లు తర్జుమాకూడ చేసుకొనవచ్చునుగాని, ఇదివరకే రూఢియైయున్న వాటిని లేవనుకొనిగాని, మరుగుపరచిగాని, విడనాడిగాని పరాయిపదములను వాడుకొనుట అవివేకమే కాగలదు. అనర్ఘమైన, అర్థవంతమైన ప్రాచీనుల శ్రమను, విజ్ఞానమును అపరిశీలితముగా నిరాదరించుట మంచిపని కాదు.

ఆయుర్వేదశాస్త్రమున, అందును శారీరకవిషయమైన సంపూర్ణ పరిజ్ఞానము ఇప్పటికి రెండువేలయేండ్లకు పూర్వమే, ఆత్రేయాది మహర్షులు సంహితాగ్రంథములందు నిక్షేపించియున్నారు.

రక్తచంక్రమణ విధానము (blood circulation) ను గూర్చి ఇప్పటికి రెండువేల సంవత్సరములకు పూర్వమే చరకప్రతిసంస్కృతమైన అగ్నివేశసంహితయందు 'సంవర్తమానం హృదయం సమావిశతి యత్పునః' (చ. సూ. 30 అ. 10 శ్లో. పుట. 185) 'సంతత్యా భోజ్యధాతూనాం పరివృత్తిస్తు చక్రవత్' (చ. చి. 15 అ 21 శ్లో. పుట 517) లలో స్పష్టముగా వివరింపబడియుండగా క్రీ॥ శ॥ 1628 లో విలియం హార్వే మహాశయుడు 'బ్లడ్ సర్క్యులేషన్' కనిపెట్టినాడని చరిత్ర పాఠాలు చదువుకొనే దౌర్భాగ్యం మనకు ఇంకా తప్పడములేదు. ఇట్టి ఉదాహరణ లెన్నో చెప్పవచ్చును.

సుశ్రుతాది వైద్యాచార్యులు శవచ్ఛేదాది పరీక్షలు జరిపి, శరీరాంగ ప్రత్యంగ పరిజ్ఞానముతో సూక్ష్మాతిసూక్ష్మపరిశీలన జరిపి కంటికి కనపడే శరీరధారకములైన ధాతువుల కన్నిటికి నామములు చెప్పి, వాని స్వరూపస్వభావాదులను వర్ణించియున్నారు. ఆ వివరములన్ని చెప్పి చెప్పి, జీవాత్మనుకూడా కనిపెట్టి చెప్పవలెనని కాబోలు, అది కంటికి కానరానిదైనందున ఇట్లు చెప్పిరి.

న శక్యః చక్షుషా ద్రష్టుం
దేహే సూక్ష్మతమో విభుః
దృశ్యతే జ్ఞానచక్షుర్భిః
తపశ్చక్షుర్భిరేవ చ" (సు. శా.)

ఈ విధముగా నెంతో శ్రమపడి, పరిశీలన జరిపి, ప్రాచీన గ్రంథ
కర్తలు మనకు ప్రసాదించిన శరీరవిషయకమైన విజ్ఞానమును, పారిభాషిక
పదజాలమును మనము విడనాడరాదు. విడనాడజాలముకూడాను. వాని
నెల్ల శ్రద్ధతో పరిశీలించి, ఉద్ధరించి వాడుకలోనికి తేవలయును. నేడు
వాడుకలో నున్న ఆంగ్లేయ శరీరపారిభాషిక పదములతో వీటిని సరిచూచు
కొని వాడుకొనుటవలన మన భాషయు, విజ్ఞానమును విస్తరిల్లి పరిపుష్టము
కాగలవు. శాస్త్రమునెడల ప్రమాణబుద్ధి యేర్పడగలదు. అట్టిపదములనెల్ల
ఏర్చి కూర్చి ఒకక్రమమున ముద్రించి ప్రకటించుటవలన నెంతో ప్రయో
జన ముండగలదు.

ఆయుర్వేద శాస్త్ర గ్రంథములందు శరీరపరములగు అంగ
ప్రత్యంగాదుల నామములు ఒకచోట గుదిగూర్చిన ట్లుండక, సందర్భవ
శాత్తు అక్కడక్కడ పేర్కొనబడియున్నవి. అంతేగాక అవి మూల
గ్రంథములందు శ్లోకమధ్యమున, గద్యమధ్యమున లేశోక్తముగాను, అవ్య
క్తముగాను, సందిగ్ధార్థప్రతిపాదకముగాను మనకు కనబడుచున్నవి.
కొన్ని అనుక్తముగాను నున్నవి. వ్యాఖ్యానకారులు అట్టి గ్రంథగ్రంథు
లను కొన్నిటిని విడదీసి వివరించినారు. అయినప్పటికిని కొన్ని ఈనాటి
కిని మన అల్పబుద్ధులకు దురవబోధముగా నుండిపోయినవి. సమన్వయము
కుదుర్చుకొనుటకు, అర్థము చేసికొనుటకు కొన్ని కొరకరాని కొయ్యలు
గానే యున్నవి. పండితులుగూడ ఏకవాక్యత కుదురక, భేదాభిప్రాయ
ములతోనే వివాదపడుచున్నారు.

చేతనాస్థానమైన హృదయము, బ్రహ్మరంధ్రము, క్లోమము, నాభి,
చక్రములు - ఇట్టివింకను చర్చనీయాంశములుగానే యుండిపోయినవి.

లోగడ ఆయుర్వేదశాస్త్ర విదులు అనేక పర్యాయములు, వివిధ
స్థలములలో పరిషత్సమావేశములు జరిపి, కొన్ని సందిగ్ధములుగా నున్న
శారీరక పారిభాషిక పదములకు అర్థనిర్ణయము చేయుచు, అవసరమైనవాటికి

సర్వసమ్మతమైన కొన్ని నూతనపదములుకూడ నిర్ణయించి వైద్య పత్రికలలోను, గ్రంథములందును ప్రకటించుట జరిగినది. అందు కొన్నింటి పర్యవసానమే ఈకోశమును సమకూర్చుటలో మాకును తోడ్పడినది.

ఆధునిక వైద్యశాస్త్రమున మానవ శరీర సంబంధముగా వాడబడుచున్న, గ్రంథస్థమై యున్న ఆంగ్ల పారిభాషిక పదములను అకారాది క్రమమున సమకూర్చి, వానికి ఆంగ్లభాషలోనే వివరముల నిచ్చిన కొన్ని కోశములు (మెడికల్ డిక్షనరీలు) కలవు. ఆవిధముగానే ప్రాచీనాయుర్వేద సంహితలలో శాస్త్రీయముగాను, ప్రామాణికముగాను సంస్కృత భాషలో లభించే పదముల నన్నిటిని ఏర్చికూర్చి, అవసరమైనచోట్ల వివరములతోను, గ్రంథస్థమై వాడుకలోనున్న కొన్ని తెలుగు పదములతోను అకారాదిక్రమమున ఆంగ్లపదములకు అర్థ వివరణముతో సహా- ఈ కోశమును సమకూర్చియున్నాము.

అకారాదిక్రమమున ఆధునిక వైద్యశాస్త్ర పదములనే యెత్తుకొని ఈకోశమును ప్రకటించుటకు కారణమేమనగా, అవి ఎక్కువ వాడుకలో నుండుటచేతను, ఇదివరకే అవి అకారాదిక్రమమున సమకూర్చి ప్రకటింపబడియుండుటచేతను - వానినే గైకొంటిమి. ఇందువలన సంస్కృతమునను, తెలుగునను సరియగు పదములు తేలికగా తెలుసుకొనుటకు వీలగును. ఇట్లు పొదివి చెప్పుటవలన సంస్కృతపదములను వాడుకలోకి తెచ్చుటకు సులభమార్గముగా గూడ నుండగలదు. అంతేగాక ఆయుర్వేదమున శరీరశాస్త్ర పారిభాషిక పదములుగాని, శరీరశాస్త్ర పరిజ్ఞానముగాని సరిగా లేదని తలచువారి అపోహ ఇందువలన సులభముగా తీరిపోగలదు.

శాస్త్రీయ పారిభాషిక పదములవిషయములో సంస్కృతపదములకు, తెలుగుపదములకు అట్టిభేదము పాటించనవసరములేదు. కొన్నిటికి తెలుగు పదములు లేవని చింతపడనవసరములేదు. సంస్కృతభవమైన తెలుగుపదములే గాక, వాడుకలోనున్న తెలుగుపదములు తెలిసినంతవరకు వివరించడమైనది. తెలుగున లభించనివానికి సంస్కృతమే వాడుటవలన ప్రమాదము లేకపోగా ప్రయోజనమే యుండగలదు.

'నిఘంటునా వినా వైద్యః' నిఘంటుజ్ఞానములేనిది వైద్యుడు కానేరడు. అందును పారిభాషికపదములకు నిఘంటువు మరీ అవసరము.

ఈ కూర్పువలన ఆయుర్వేద శాస్త్రములో అపరిశీలితముగాను, సందిగ్ధముగాను నున్న శరీరసంబంధమైన పదజాలమునకు ఆధునిక వైద్య శాస్త్రదృష్ట్యాకూడా వివరణము, సమన్వయము లభించగలదని మా తలంపు. ఈ పదములను సమకూర్చుటలో ప్రాచీనసంహితాకర్తలు చెప్పినవే గాక, అప్తులైన శ్రీ గణనాథసేన్, శ్రీ పి యస్. వారియర్ మొదలైన ఆధునికులు తమగ్రంథములందు వాడిన పదములుకూడ యిందు చేర్చినాము.

ఏఏ గ్రంథములనుండి, వ్యాఖ్యానములనుండి పదములను, వాక్యములను ఉద్ధరించి, ఉదహరించినదీ - వాటి ఆకరములను దెలిపినాము.

వైద్యపండితులై ఆంధ్రమున శారీరశాస్త్రవిషయమున పరిశ్రమ చేసి గ్రంథములు రచించి దివంగతులైన డాక్టరు ఆచంట లక్ష్మీపతి, శ్రీ ప్రతివాదిభయంకర కృష్ణమాచార్యులు, శ్రీ ముక్కామల వేంకటశాస్త్రి ఈసందర్భమున మనకు స్మరణీయులు.

ఈనిఘంటువు సంపూర్ణము కాదు. ఇంకను కూర్చవలసినవి, చేర్చవలసినవి, వివరణముల నవేక్షించునవి చాల కలవు. కూర్చినవానిలోగూడ మా అపరిజ్ఞానముచేత అన్యధాకరించినవికూడ కొన్ని యుండవచ్చును. ప్రాజ్ఞులైనవారు మాకు తెలిపి సహకరించిన పునర్ముద్రణలో సవరించుకొనగలము.

చిరకాల పరిశ్రమ ఫలితముగా ఈకోశము వెలువడినది. ఆధునిక వైద్యులకు, ఆయుర్వేద వైద్యులకు, విద్యార్థులకు, శాస్త్రపరిశోధకులకు ఈ కోశము ఉపయోగపడగలదని మా విశ్వాసము.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ఈకోశముద్రణకై వేయి రూపాయీలు విరాళముగా నిచ్చినారు. వారికి కృతజ్ఞులము.

వేటూరి శంకరశాస్త్రి
ముదిగొండ గోపాలరావు

# శరీరాఙ్గవర్ణనమ్

## అథర్వవేదః - కాం. 10. సూ. 2

కేన పార్ష్ణీ ఆభృతే పూరుషస్య, కేన మాంసం సంభృతం, కేన గుల్ఫౌ
కేనాఙ్గులీః పేశనీః, కేన ఖాని, కేనోచ్ఛ్లఙ్ఖౌ మధ్యతః కః ప్రతిష్ఠామ్ ౧
కస్మాన్ను గుల్ఫావధరావకృణ్వన్నష్ఠీవన్తావుత్తరౌ పూరుషస్య
జఙ్ఘే నిర్ఋత్య న్యదధుః క్వ స్విజ్జానునోః సన్ధీ క ఉ తచ్చికేత ౨
చతుష్టయం యుజ్యతే సంహితాన్తం జానుభ్యామూర్ధ్వం శిథిరం కబన్ధమ్
శ్రోణీ యదూరూ క ఉ తజ్జజాన యాభ్యాం కుసిన్ధం సుదృఢం బభూవ ౩
కతి దేవాః, కతమే త ఆసన్ య ఉరో గ్రీవాశ్చిక్యుః పూరుషస్య
కతి స్తనౌ వ్యదధుః, కః కఫోడౌ, కతి స్కన్ధాన్, కతి పృష్ఠీరచిన్వన్ ౪
కో అస్య బాహూ సమభరద్వీర్యం కరవాదితి
అంసౌ కో అస్య తద్దేవః కుసిన్ధే అధ్యాదధౌ ౫
కః సప్త ఖాని వి తతర్ద శీర్షణి కర్ణావిమౌ నాసికే చక్షణీ ముఖమ్
యేషాం పురుత్రా విజయస్య మహ్మని చతుష్పాదో ద్విపదో యన్తి యామమ్ ౬
హన్వోర్హి జిహ్వామదధాత్ పురూచీమధా మహీమధి శిశ్రాయ వాచమ్
స ఆ వరీవర్తి భువనేష్వన్తరపో వసానః క ఉ తచ్చికేత ౭
మస్తిష్కమస్య యతమో లలాటం కకాటికాం ప్రథమో యః కపాలమ్
చిత్వా చిత్యం హన్వోః పూరుషస్య దివం రురోహ కతమః స దేవః ౮
ప్రియాప్రియాణి బహులా స్వప్నం సంబాధతన్ద్ర్యః
ఆనన్దానుగ్రో నన్దాంశ్చ కస్మాద్వహతి పూరుషః ౯
ఆర్తిరవర్తిర్నిర్ఋతిః కుతో ను పురుషేఽమతిః
రాద్ధిః సమృద్ధిరవ్యృద్ధిర్మతిరుదితయః కుతః ౧౦

కో అస్మి న్స్నాశో వ్యదధాద్ విషూవృతః పురూవృతః సిన్ధుసృత్యాయ జాతాః
తీవ్రా అరుణాః లోహినీ స్తామ్రధూమ్రా ఊర్ధ్వా అవాచీః పురుషే తిరశ్చీః ౧౧

కో అస్మిన్ రూప మదధాత్ కో మహ్యానం చ నామ చ
గాతుం కో అస్మిన్ కః కేతుం క శ్చరిత్రాణి పూరుషే ౧౨

కో అస్మిన్ ప్రాణ మవయత్ కో అపానం వ్యాన ము
సమాన మస్మిన్ కో దేవోఽ ధిశిశ్రాయ పూరుషే ౧౩

కో అస్మిన్ యజ్ఞ మదధా దేకో దేవోఽధి పూరుషే
కో అస్మి నత్సత్యం కోఽనృతం కుతో మృత్యుః కుతోఽమృతమ్ ౧౪

కో అస్మై వాసః పర్యదధాత్ కో అ స్యాయు రకల్పయత్
బలం కో అస్మై ప్రాయచ్ఛత్ కో అ స్యాకల్పయ జ్జవమ్ ౧౫

కే నాపో అన్వతనుత కే నాహ రకరోద్ రుచే
ఉషసం కేనా న్వైన్ధ కేన సాయం భవం దదే ౧౬

కో అస్మిన్ రేతో న్యదధాత్ తన్తు రాతాయతా మితి
మేధాం కో అస్మి న్నధ్యౌహాత్ కో బాణం కో నృతో దధౌ ౧౭

కే నేమాం భూమి మౌర్ణోత్ కేన పర్యభవ ద్దివమ్
కే నాభి మహ్నా పర్వతాన్ కేన కర్మాణి పూరుషః ౧౮

కేన పర్జన్య మన్వేతి కేన సోమం విచక్షణమ్
కేన యజ్ఞం చ శ్రద్ధాం చ కే నాస్మిన్ నిహితం మనః ౧౯

కేన శ్రోత్రియ మాప్నోతి కే నేమం పరమేష్ఠినమ్
కే నేమ మగ్నిం పూరుషః కేన సంవత్సరం మమే ౨౦

బ్రహ్మ శ్రోత్రియ మాప్నోతి బ్ర హ్మేమం పరమేష్ఠినమ్
బ్ర హ్మేమ మగ్నిం పూరుషో బ్రహ్మ సంవత్సరం మమే ౨౧

కేన దేవాం అను క్షియతి కేన దైవజనీ ర్విశః
కే నేద మన్య న్నక్షత్రం కేన సత్ క్షత్ర ముచ్యతే ౨౨

బ్రహ్మ దేవా మను క్షియతి బ్రహ్మ దైవజనీ ర్విశః
బ్రహ్మేద మన్య న్నక్షత్రం బ్రహ్మ సత్ క్షత్ర ముచ్యతే ౨౩

కే నేయం భూమి ర్విహితా కేన ద్యౌ రుత్తరా హితా
కే నేద మూర్ధ్వం తిర్యక్ చాన్తరిక్షం వ్యచో హితమ్ ౨౪

బ్రహ్మణా భూమి ర్విహితా బ్రహ్మ ద్యౌ రుత్తరా హితా
బ్రహ్మేద మూర్ధ్వం తిర్యక్ చాన్తరిక్షం వ్యచో హితమ్ ౨౫

మూర్ధాన మస్య సంసీవ్యాథర్వా హృదయం చ యత్
మస్తిష్కా దూర్ధ్వః ప్రైరయత్ పవమానోఽధి శీర్షతః ౨౬

తద్వా అథర్వణః శిరో దేవకోశః సముబ్జితః
తత్ ప్రాణో అభిరక్షతి శిరో అన్న మథో మనః ౨౭

ఊర్ధ్వో ను సృష్టా౩స్తిర్యజ్ ను సృష్టా౩ః సర్వా దిశః పురుష ఆ బభూవా౩ం
పురం యో బ్రహ్మణో వేద యస్యాః పురుష ఉచ్యతే ౨౮

యో వై తాం బ్రహ్మణో వేదామృతే నావృతాం పురీమ్
తస్మై బ్రహ్మ చ బ్రహ్మా చ చక్షుః ప్రాణం ప్రజాం దదుః ౨౯

న వై తం చక్షు ర్జహాతి న ప్రాణో జరసః పురా
పురం యో బ్రహ్మణో వేద యస్యాః పురుష ఉచ్యతే ౩౦

## రక్త సఞ్చార వర్ణనమ్

అష్టాచక్రా నవద్వారా దేవానాం పూ రయోధ్యా
తస్యాం హిరణ్యయః కోశః స్వర్గో జ్యోతిషా వృతః ౩౧

తస్మిన్ హిరణ్యయే కోశే త్ర్యరే త్రిప్రతిష్ఠితే
తస్మిన్ య ద్యక్షమాత్మన్వత్ తద్ వై బ్రహ్మవిదో విదుః ౩౨

ప్రభ్రాజమానాం హరిణీం యశసా సంపరీవృతామ్
పురం హిరణ్యయీం బ్రహ్మ వివే శాపరాజితామ్ ౩౩

కించ :—

శరీరావయవా స్తు పరమాణుభేదే నాపరిసంఖ్యేయా భవన్తి. అతిబహుత్వా దతి సౌక్ష్మ్యా దతీన్ద్రియత్వాచ్చ తేషాం సంయోగవిభాగే పరమాణూనాం కారణం వాయుః, కర్మస్వభావ శ్చ. చ. శా. అ. ౭. గద్య 17.

(శరీరసఙ్ఖ్యాశారీరం).

# BIBLIOGRAPHY




| | |
|---|---|
| **Amarakosa** | .. Amarasimha |
| **Astangahridaya Samhita** | .. Vagbhatacharya |
| **Astanga Sangraha** | .. - do - |
| **Astanga Saareera** | .. Wariyar, P. S. |
| **Asthipanjaram** | .. A. Lakshmipathi |
| **Asthipanjaramu** | .. Andhra Vignana Sarvaswamu |
| **Ayurveda Saareera Sastra Sangraha** | P. B. Krishnamacharya |
| **Bhaavaprakasa** | .. Bhavamisra |
| **Bhela Samhita** | .. Bhela |
| **Bruhat Saareeram** | .. Wariyar, P. S. |
| **Charaka Samhita** | .. Agnivesa |
| **English Sanskrit Dictionary** | . Monier William |
| **Hindi Scientific Glossory** | .. |
| **Kaamasutra** | . Vatsyayana |
| **Madhavanidana** | .. Madhavakara |
| **Paaribhashikapadakosam** | .. K. Nageswara Rao |
| **Prasuthisastra Part I** | .. Prasadilal Jha, L. M. S. |
| **Pratyaksha Saareera** | .. Gananatha Sen |
| **Sarngadhara Samhita** | .. Sarngadhara |
| **Saareera Kriya Vignanam** | .. Ranajeeth Roy |
| **Saareera Sabda Sangraham** | .. |
| **Scientific Glossary** | .. D. V. Sivarao |
| **Studies in the Medicine of Ancient India** (Osteology) | Hoernle |
| **Susruta Samhita** | .. Susruta |


—o—

# A

bdomen: belly, the cavity in the body between the thorax and the pelvis including stomach, bowels and other nutritive organs. అన్తఃకోష్ఠః, ఉదరకోష్ఠః, ఉదరమ్, కుక్షిః, కుమ్భః, కోష్ఠః. వ్యా:- 1 సమస్తముదరమ్, 2. ఉరశ్శ్రోణ్యన్తర్గతః, జఠరమ్. తె. ఉదరము, కడుపు, జఠరము, బొజ్జ, బొఱ్ఱ.

కోష్ఠలక్షణమ్ యథా :— స్థానాన్యామాగ్నిపక్వానాం మూత్రస్య రుధిరస్య చ । హృదుణ్డుకం పుప్ఫుసశ్చ కోష్ఠ ఇత్యభిధీయతే. (సు. చి. అ 2 శ్లో 12)

Antero-lateral aspect of A.
Antero-lateral part of A.
Anterior part of abdomen: ఉదరఫలకమ్. తె. వెలికడుపు. వి. కడుపు ముందుభాగము, పలకవలెనుండు కడుపు పైభాగము.

Lateral aspect of A.: ఉదరపార్శ్వః. తె. డొక్క.

Lower A.: అధరకుక్షిః, అధరోదరమ్, ఉత్తరకుక్షిః, శ్రోణ్యుదరమ్. వ్యా:- కుక్షేరధోభాగః. తె. క్రింది కడుపు, క్రీగడుపు, పొత్తికడుపు. వి. బొడ్డు క్రిందిభాగము.

Upper A.: ఊర్ధ్వోదరమ్, పూర్వోదరమ్. వ్యా. కుక్షేరూర్ధ్వభాగః. తె. ఎగుకడుపు, ఎగువకడుపు, పైకడుపు, మీగడుపు.

Abdominal: of the abdomen. ఉదరకః, ఔదర్య, ఉదరసమ్బన్ధః, కౌక్షః, కౌక్షీ, కౌక్షేయః, కౌక్షేయీ. తె. కడుపునకుచెందిన, కడుపునబుట్టిన.

A. aorta - see aorta.
A. cavity - see cavity.
A. fat: extra peritonial fat. వపా, వసా. తె. వప. వి. కడుపున నుండు క్రొవ్వుపొర.
A. ganglia - see ganglia.
A. muscle - see muscle.
A. region - see region.
A. ring - see ring.
A. wall - belly wall - see Antero - lateral aspect of abdomen.

Abduccns: a muscle drawing from the median line. మధ్యరేఖాదాకృష్టపేశీ.

Abduction: drawing away from the median line; movement from the median line. అపవర్తనమ్, ఆకర్షణమ్. వ్యా:- మధ్యతః ఆకర్షణమ్, దూరీకరణమ్, మధ్యరేఖాయాః గతిర్వాచలనమ్, క్రియా. తె. ఈడ్[illegible]లాగుడు. [illegible] ఒక గీత నడుమ[illegible]లికి నడ్డు[illegible] లేక లాగుట; క[illegible]

**Abductor** : అపకర్షకః, అపకర్షణీ, ఆకర్షకః. తె. ఈడ్చునట్టి, లాగునట్టి.
A. canal - see canal

**Absorption** : అవశోషణమ్, ఆచమనమ్, ఆచూషణమ్, గ్రసనమ్, శోషణమ్. తె. పీల్చుట, పీల్పు, లోపలికి ఆకర్షించుకొనుట, లోపలికి గ్రహించుట, లోపలికి లాగికొనుట.

**Acetabulum** : socket of thigh bone; the cavity that receives the head of the femur (1) కట్యుదూఖలమ్, శ్రోణ్యుదూఖలమ్; సక్థిబిలమ్. తె. బంతిగిన్నె. వి. ఊర్వస్థిశిరస్సు (తొడఎముక మొదలు) తిరుగుటకు శ్రోణిఫలకమునం (చట్టఎముకయం) దేర్పడియున్న రోలు వంటి గుంట. (2) ఉదూఖలమ్. వ్యా:- నిమ్న మధ్య ముదూఖల సన్నిస్థానమ్. తె. బంతిగిన్నెకీలు. వి. రోలువలె మధ్య గుంటగానుండు కీలుభాగము

**Achroma** : pallor; absence of colour. అవర్ణః, నిర్వర్ణః. తె. అవర్ణము, రంగులేమి, వన్నెలేమి. వి. పాలిపోవుట.

**Achromatic** : అవర్ణమైన, రంగులేని.
A. spindle - see spindle.

**Achromatin** : అక్రమాధీనః, అవర్ణప్రియః, అవర్ణశ్లేషీ. తె. అవర్ణప్రియము, రంగులేనట్టి.

**Acid** : sour. ఆమ్లమ్, ఆసుతమ్, శుక్తమ్. తె. ఆమ్లము, కాడి, పులిసిన, పులుసు.

**Acidity** : ఆమ్లతా, ఆమ్లత్వమ్. శుక్తతా. తె. పుల్లదనము, పులుపు.

**Acini** : సూక్ష్మదరీ.

**Acinus**: smallest gland division. సూక్ష్మతమగ్రంథి విభాగః. తె. కణితి (గ్రంధి) లోని మిక్కిలి చిన్న విభాగము.

**Acoustic** : relating to the sence of hearing, sound or the ear. = శ్రో(త్రేన్ద్రి)యసమ్బన్ధి, శ్రవణసమ్బన్ధి, ధ్వనిసమ్బన్ధి, కర్ణసమ్బన్ధీ. తె. చెవికి చెందిన, ధ్వనికిసంబంధించిన.
A ganglia - see ganglia.
A. nerve - see nerve.
External A. meatus - see meatus.

**Acoustics** : the science of sound. శ్రావణశాస్త్రః. వ్యా:- నాదవిజ్ఞానమ్, నాదవిద్యా. తె. ధ్వనివిద్య, నాదవిజ్ఞానము, నాదశాస్త్రము.

**Acromion** : అంసః. వ్యా:- బాహుమూర్ధగ్రీవయోర్మధ్యేంసపీఠస్కన్ధనిబన్ధనా వంసౌ. (సు.శా. 6-26) అంసఫలకభుజశిరసోర్బన్ధనా వంసౌ (డల్హనః). వ్యా:- భుజశిరః (యాజ్ఞవల్క్యస్మృతిః), అంసకూటః, అంసపీఠః, బాహుమూర్ధా, బాహుశిరః, బాహుశీర్షమ్, భుజశిరః. తె. గూడ, బుజము, భుజము. వి. అంసాగ్రము, పాముపడగవలె బయటికి గుపడు

చుండు భుజముయొక్క ఎత్తైన భాగము.

A. region - see region.

Acroposthia - see prepuce.

Action కర్మ, క్రియా, చేష్టా, వ్యాపారః తె. కదలిక, కర్మ, క్రియ, చలనము, పని.

Active A. : అనలసవ్యాపారః. తె. చురుకుగలపని.

Automatic A. : స్వచాలిత క్రియా. తె. తనంతటతనే జరుగుపని.

Involuntary A. : అనిచ్ఛాధీన వ్యాపారః, అనైచ్ఛికక్రియా. తె. అప్రయత్నపూర్వకమైనకదలిక; పని.

Involuntary muscular A. : స్వతంత్ర పేశీచేష్టా. తె. ఇచ్ఛానధీన కండరచలనము. వి. అప్రయత్నముగా జరుగు కండరముల కదలిక; వ్యాపారము. ఇది అనిచ్ఛాపూర్వకముగ కండరములలో నిరంతరము జరుగుచుండును.

Muscular A. : పేశీక్రియా. తె. కండరచలనము.

Passive A. : అలసవ్యాపారః. తె. మందగొడితనము, స్తబ్ధత.

Reflex A. : అసంకల్పితచర్యా, అసంకల్పిత ప్రతీకారచర్యా, ప్రతిసంక్రమితక్రియా. ప్రతివర్తిక్రియా తె. మరల గొట్టబడిన చర్య.

Reflex muscular A. : ప్రతిసంక్రమిత పేశీ వ్యాపారః. తె. మరల గొట్టబడిన కండరచలనము.

Specific dynamic A. : ఉద్దీపక గుణవిశేషక్రియా, విశిష్టశక్త్యుత్పాదకక్రియా.

Voluntary A. : ఇచ్ఛాధీన వ్యాపారః, ఐచ్ఛికక్రియా వా వ్యాపారః, సంకల్పితచేష్టా. తె. స్వతంత్ర చలనము.

Voluntary muscular A. : ఇచ్ఛానుగా పేశీచేష్టా, స్వేచ్ఛానుగా పేశీ వ్యాపారః. తె. స్వతంత్ర కండరచలనము.

Adam's apple : a projection in front of the neck due to the thyroid cartilage (of the larynx) కణ్ఠమణిః, గలగ్రన్థిః. వ్యా:-కన్ధరాయాః పురత ఊర్ధ్వభాగే కణ్ఠః, తస్య మధ్యే కణ్ఠమణిః. గలపూర్వతః చలనోన్నతప్రదేశః. తె. కంఠమణి, కుతికకాయ, గొంతుకాయ, గొంతుకముడి, గొంతుపోక. వి. గొంతుక బయట (ముందు) ఎత్తుగా కదలికగల ముడి. ఇది తినునపుడు, త్రాగునపుడు, క్రిందికి పైకి కదలుచుండును.

Adduct, Adduction : to draw or move towards the centre : అభివర్తనమ్, ఉపకర్షణమ్, ప్రతినీతమ్, ప్రణ(న)యనమ్, మధ్యానతమ్. తె. (1) నడిమికిచేయుట, నడిమికి లాగుట, నడిమికిచేరిన, నడిమికిలాగిన లేక వచ్చిన. (2) ఒకదానితో నొకటి

చేరిక, ఒక దానితో నొకటి చేరుట.
(3) అక్షి మధ్యాభిముఖ్యము.

Adenoid, Adenoids: a growth or mass of spongy tissue between back of nose and throat. Resembling a gland.
(1) నాసాగలగ్రన్థిః. వ్యా:- నాసాగలయో ర్మధ్యస్థం మాంసపిణ్డమ్. మాంసపిణ్డ మేతత్ నాసాగలయో ర్మధ్యేపశ్చిమతః వర్తతే. ఏతత్ స్పంజ ఇవ వా జలశోషణీ ఇవదృశ్యతే తె. కొయ్యగండ. వి. ముక్కు లోతట్టున సప్తపథలో ప్రవేశించు ద్వారము చెంత ఉబ్బియుండు తడిచర్మము. ముక్కు గొంతుకలమధ్య వెనుకవైపున పెరుగు మాంసముద్ద, సప్తపథ ద్వారమువద్ద పెరుగు మెత్తని మాంసపు కణితి. ఇవి పెరుగుటవలన శ్వాస పీల్చుట కష్టముగానుండును.
(2) గ్రన్థ్యాభో గ్రన్థి విశేషః.

Adenology: the science of the glandular system. గ్రన్థిమండల విజ్ఞానమ్, గ్రన్థిసంస్థాన విజ్ఞానమ్. తె. గ్రంథులకు సంబంధించిన శాస్త్రము.

Adipose: fatty, of a fatty nature. మేదః, మేదోమయః. తె. క్రొవ్వు, క్రొవ్విన.
A. arteries - see artery.
A. tissue - see tissue.

Adrenal: At the kidney: The suprarenal capsule. అధివృక్కః, (అధివృక్కౌ-ద్వౌ.) వ్యా:- నిఃస్రోతస్కౌ త్రికోణప్రాయౌ వృక్కశిఖర యోస్సమ్బద్ధౌ. తె. అధివృక్కలు, వి. గురదాలపైన నాళములేని ముక్కోణాకారమున ఎత్తుగనుండు మాంసపు ముద్దలు, రెండు గ్రంథులు.

Adventitia: the external coat of bloodvessels. రక్తధరాకలా, బాహ్యరక్తవాహినీకఞ్చుకమ్.

Afferent. carrying towards the centre or inward. (1) అభిగామీ, అభివాహీ, ఆగామీ, ఆగామినీ. (2) అన్తర్ముఖీ, అన్తర్వాహినీ. తె. బహిఃప్రాచీరమునుండి లోనికి గొనిపోవునది.

After-birth: the placenta and membranes; the secundiness. A membrane enveloping the foetus in the womb. అపరా. జరాయుః, తె. మావి. వి. గర్భములో పిండమును కప్పియుండు పొర, ప్రసవించిన తరువాత గర్భాశయము నుండి బయటబడు మావి.

Age: వయః. తె. ఈడు, వయస్సు

Air: ఆకాశజః, ఈరణః. వ్యా:- అన్తర్బహిః స్సంచారీవాయుః, వాతః, వాయుః. తె. గాలి, వాతము, వాయువు.
A. bladder: వాయుకోశః. తె. గాలిబుడగ, గాలితిత్తి.

A. bone - see bone

A. cell - see cell

A. sac - see sac

Atmospheric A : మహావాయు పథమండలి వాయువు, వాతావరణము

A. sinus - see sinus

Ala : wing. పక్షః. వ్యా:- పక్షిపక్షాకారో విస్తృత ప్రరోహః. తె. పక్షము, రెక్క.

A. of the ilium - see bone

A. nasi : నాసాపక్షకౌ. వ్యా:- నాసాపుట బహిర్భాగౌ. తె. ముక్కుకోళ్లు, ముక్కోళ్లు వి ముక్కు రంధ్రముల వెలిభాగములు.

Alar : wing-like పక్ష, పక్షా తె. పక్షమువంటి, రెక్కవంటి వి. పక్షి రెక్కవలె వెడల్పుగా విప్పారి ప్రక్కలకు పొడుచుకొని వచ్చియుండు భాగము.

Albumen : ధవలకమ్. తె. జొన, సొన, శ్వేతధాతువు. వి. కోడి మొదలగు పక్షుల గ్రుడ్లలో నుండు చిక్కని, తెల్లని జిగురుగల పలచని వస్తువు.

Serum A : సరధవలకః.

Aliment : food, nourishment. అన్నమ్, ఆహారః, ఖాద్యం, భోజనం, పౌష్టికమ్. తె. అన్నము, ఆహారము, కూడు, భోజనము.

Alimentary : nourishing. ఆహార్యః, ఆహారసమ్బన్ధీ, పోషకః, పౌష్టికః, భరణశీలః. తె. అన్నము నకు లేక పోషణకు సంబంధించిన.

A canal - see canal.

a portion of A. canal between pyloric volves పచ్యమానాశయః. తె. కడుపు, పొట్ట. వి. భుజించిన చతుర్విధాహారము (అన్నపానాదులు) జీర్ణమగుస్థలము, నోటి నుండి ముడ్డివఱకునుండు గొట్టమునందలి భాగము. చిన్న, పెద్ద ప్రేవులు కలిసిన సొరంగము నందొక భాగము.

A. duct - see Thoracic duct

A. system - see system.

A. tract - see tract.

Part of the A. canal upto the stomach. ఊర్ధ్వకోష్ఠః. తె. వి. నోటినుండి ఆమాశయము వరకు వ్యాపించియుండు భాగము.

Alkali : క్షారః. తె. కారము, క్షారము.

Allantois : a fetal appendage, membrane. ఆళిన్ధః, ఆళిన్ధనాళీ. వ్యా:- నాభి నాళస్యాఙ్కురః, ఆద్యన్త్ర పశ్చిమఖణ్డస్య ఉపగుహావత్ కోఽపినాళః, అథవా కాఽపినాళీ. తె. బొడ్డుమొలక. వి. ఇది మొలకవలె నుండు బొడ్డునాళము, పిండము నంటి యుండు సన్నని కాడ.

Alveolar : ఔదూఖల(లీ). తె. గుంట, తొఱ్ఱ. వి. గోలు ఆకారముగ నుండు గుంట.

Alveoli - see alveolus.

Alveolus : (1) An air vesicle. అనిలాయానమ్, ఊరణకోశః, ఊరణదరీ, వాయుకోశః, సూక్ష్మదరీ. తె. గాలిబుడగలు, గాలిగదులు, వాయుగోళములు. వి. శ్వాసకోశమునందలి చిన్న గాలిగదులు. (2) Bony socket of a tooth; a small cavity. ఉలూఖలమ్, విలమ్. వ్యా:- రుచకాకృతినా మధ్యమవానా మవగాహా నానుకూలాగర్త విశేషా యథా :- అల్పబిలమ్, దన్తబిలమ్, సూక్ష్మదరీ, కోష్ఠికా, రన్ధ్రికమ్. తె. కుదురు, గుంట, పాదు, బెజ్జము, రంధ్రము. వి. రుచకాకారముగల చిన్నదై (కొన తేలియుండు) అవయవములు ఇమిడి కదలకుండా బిగువుగా పొదిగి యుంచుటకుగాని, పాదుకొనుటకుగాని వీలుగా నుండు కొలది లోతుగల గుంట (గుంటలు), కుదుళ్ళు.

A. of tooth : దన్తబిలమ్, దన్తోలూఖలమ్. దన్తోదూఖలికా, తె. పంటికుదురు, పనుకుదుళ్ళు(ళ్లు), పల్లుకుదురు.

Alveolus : (2) Air vesicles. ఊరణకోశాః. వ్యా:- పుప్ఫుసాన్తవా అపస్తమ్భస్యాన్తిమ ప్రతానాని. తె. వాయుకోశములు, వాయుగోళములు వి. ఈ గోళములు ఊపిరితిత్తులందు వ్యాపించియుండి, తేనెతెట్టెయందలి గూళ్లను బోలియుండును.

Amitosis : Direct cell-division. ఆకారిక విభాగః, కణవిభాగః, సమవిభజనమ్. తె. కణవిభజనము, కణవిభాగము.

Amnion : Inner-most embryonic membrane which encloses foetus before birth. (1) అపరాయుః, అమ్నియామికా, ఆభ్యన్తర గర్భధరా, ఆభ్యన్తర జరాయుః, గర్భధరా, జరాయుః. తె.మా వి. వి. బిడ్డ పుట్టక పూర్వము గర్భాశయమున పిండమును లేక శిశువును ఆవరించియుండు మిక్కిలి సన్నని నిగనిగలాడు నూనె మెరుగు కాగితమువంటి పొర. ఇది పిండమునకు ఒకపిడి లేకుండా తగినంత ఉష్మ్రపిరు కలిగియుండును. దీనిగుండా లోనికి వెలుతురు జొరబడును. (2) గర్భాన్తరావరణమ్. తె. గర్భసంచిలో పొర.

Amniotic : belonging to the amnion. అపరాయవ, జారాయవ. తె. మావికి చెందిన.

A. cavity - see cavity.

A. ectoderm - see ectoderm.

A. fluid - see fluid.

A. sac - see sac.

A. vesicle - see vesicle.

Ampulla: flask-shaped dilation. కలశికా. తె. కలశము, బుడ్డి.

A. of the lactic ferous :

స్తన్యాశయః, స్తన్యప్రవాహికా, స్తన్యవాహినీ. తె. స్తన్యాశయము. వి. చనుబాలు పుట్టుచోటు.

Amygdala: (1) a tonsil, (2) a lobe of cerebellum. (1) ఉపజిహ్వికా, గళగుటికా. వ్యా:- కణ్ఠస్యోపరి జిహ్వామూలస్థితో మాంసపిణ్డవిశేషః. వాతామమ్. తె. వి. సీమ బాదము వలె నుండు అవయవ విశేషము. (2) అధర మస్తిష్కఖణ్డః.

Anabolism : constructive metabolism; constructive process within the protoplasm by which food or other material at a relatively low level passes through an ascending series of ever-more complex and unstable combination, till it is finally worked up into living matter. అనుబలనమ్, ఉత్కర్షః, ఉపచయః, చయః, ప్రసాదపాకః, సృష్టిః. తె. నిర్మాణ జీవన వ్యాపారము, సంఘటనాత్మక క్రియ. వి. జీవధాతు నిర్మాణమునకు జరుగు రాసాయనిక పరిణామము.

Anal : pertaining to the anus. అపాన సమ్బన్ధః, అపానీయ, గుద సమ్బన్ధీ. తె. మలద్వారమునకు సంబంధించిన, ముడ్డికి చెందిన.

A. area : గుదదేశః, గుదమణ్డలమ్, గుదాన్తః (సు. ని. 4-10. డల్హనః). తె. ఆసనద్వారము.

A. aperture - see A. passage.

A. canal - see canal

A. opening - see canal.

A. orifice - see orifice.

A. passage : అధరగుదమ్, అధర గుదః, అధఃస్రోతః, అపానమ్, అపాననాళీ, గుదద్వారమ్, గుద నాళిం(ః), గుదమార్గః, గుదముఖమ్, పాయురన్ధ్రమ్, విణ్మార్గః, శకృన్మార్గః. తె. ఆసనము, పితిముడ్డి, ముడ్డి. వి. ప్రేవులలోని మలము బయటికి వెడలు దారి, మలమువచ్చు ద్వారము.

A. margi : గుదౌష్ఠః. తె. ముడ్డి అంచు. వి. గుదద్వారమున నుండు లావు పెదమువంటి అంచు.

A. region - see region.

A. triangle : గుదమర్మ. తె. ఆసన మర్మము.

A. tube - see tube.

A. tubercle - see tubercle.

A. valve - see valve.

Anaphase : అద్యాలోకః. తె. కణ విభజనలో ఒక దశ.

Anastomosis : cross connection or junction of vessels or hollow organs or arteries, branches. (1) అనుమేలనమ్, తిర్యక్సన్ధానమ్. తె. కల

యుక, సంగమము. వి. నాళములు. రక్త మధ్యాంగముల ఒండొంటి కలయిక, ఈకలయిక రక్త నాళాదు లందు కానవచ్చును. (2) మధ్యేమార్గః. తె. వి. రెండు ప్రదేశముల మధ్య నేర్పడిన దారి. ఇది దోష వికృతిచే గాని శస్త్రక్రియలచేగాని యేర్ప డును (3) సిరామర్మములు, ధమనీ సంగమములు.

Dorsal A : పృష్ఠ్యానుమేలనమ్.

Middle A : మధ్యమానుమేలనమ్.

Anastomotic pertaining to anastomosis. అనుమేలనీయ, అను మేల్య.

A. branch - see branch.

A. loop - see loop.

Anatomic, Anatomical: belonging to anatomy. (1) శరీర శాస్త్ర నిర్మాణ సమ్బన్ధి, శారీర, శారీరక, శారీర రచనా సమ్బన్ధి. తె. శరీర శాస్త్రమునకు సంబంధించిన (2) వ్యవచ్ఛేద విద్యా సమ్బన్ధకః.

A. enumeration of the body శరీర సంఖ్య.

A. nominclature : శారీర పరి భాషా.

Anatomy : (1) the science of body or organic structure (2) science or branch of morphology which treats of the structure of organisms and the relation of their parts. (1) రచనా శారీరమ్. నిష్పత్తిః:— రచనాప్రతిపాదకం శారీరమ్, రచనాశారీరమ్, శరీరరచనా విజ్ఞానమ్, శరీర నిర్మాణ విజ్ఞానమ్, శరీర నిర్మాణ శాస్త్రమ్, శరీర వ్యవచ్ఛేద విద్యా, శారీరమ్, శారీర శాస్త్రమ్. (2) విశసనవిద్యా, శరీర విచయమ్. వ్యాః:- శరీరస్య విచయనం విచయః, శరీరస్య ప్రవిభాగేన జ్ఞాన మిత్యర్థః (చ. శా. 6.13. చక్ర ప్రాణిః). శరీర సఙ్ఖ్యానమ్. (చ.శా. 7.1) తె. శరీర విజ్ఞానము, శరీర శాస్త్రము, శారీరము, శారీర విజ్ఞా నము. వి. శరీరము పుట్టుకను దాని అవయవముల నిర్మాణమునుగురించి విడి విడిగా తెలియజెప్పు శాస్త్రము. (3) దేహసంస్థాన విద్యా. తె. ఛేదించి లోని అవయవముల విన్యాసములను, పొందికలను పరిశీలించు విద్య.

Applied A : anatomy as applied to diagnosis and treatment. నిదాన చికిత్సా శారీర విజ్ఞానమ్.

Comparative A : a comparison of the anatomy of different animal orders. అనుషఙ్గిక వా ప్రాసఙ్గిక శారీర విజ్ఞా నమ్, తులనాత్మక శారీర విజ్ఞానమ్, సదృశ రచనా శారీరమ్.

Descriptive A : a study of

the individual parts of the body. ప్రత్యఙ్గ శారీర రచనాధ్యాయనమ్, నిర్దిష్ట వా నిర్దేశక శారీర విజ్ఞానమ్, సముద్దేశక శారీర విజ్ఞానమ్.

Gross A. anatomy as studied by the naked eye. ప్రత్యక్ష శారీర విజ్ఞానమ్.

Human A: మానవ రచనా శారీరమ్.

Microscopic A: that stuied under the microscope. సూక్ష్మ శారీర విజ్ఞానమ్, వ్యా:- సూక్ష్మ దర్శన యన్త్ర సహాయేన ప్రాప్తం శారీర విజ్ఞానమ్.

Morbid A: the study of diseased structure. రుక్శరీర విజ్ఞానమ్.

Pathological A: వికృత శారీరమ్, వికృత శారీర విజ్ఞానమ్.

Regional A: the study of correlated regions of the body. ప్రాదేశిక శరీరాఙ్గ విజ్ఞానమ్

Surface A: బహిశ్శారీర విజ్ఞానమ్.

Systemic A: వివిధ వస్తుధాతు విజ్ఞానమ్, శరీర నిర్మాణానుక్రమణికా.

Topographic A: anatomy of a part in its relation to other parts. అన్యోన్యాఙ్గ రచనాత్మక శారీరమ్, అన్యోన్యాఙ్గ సమ్బన్ధ శారీర విజ్ఞానమ్, నిర్దిష్టాఙ్గ వర్ణన శారీరమ్. తె. ప్రత్యంగ సమ్బన్ధ వర్ణనము, శరీరాఙ్గ వర్ణనము.

Angiology: the science of the bloodvessels and lymphatics. నాళీవిజ్ఞానమ్, నాళీస్కన్ధః. వ్యా:- రక్తాయనీ, రసాయనీ, రసవాహిన్యాదీనాం నాళా (ళీ) నాం స్వరూప వర్ణనమ్. తె. నాళవిజ్ఞానము. వి. రక్త రసాది నాళముల స్వరూపాదులను గురించి తెలియజెప్పు శాస్త్రము.

Angle: space between two meeting lines. అస్రః, కోణః, ద్విభుజః, మూలః, వ్యా:- కేవలైక కోణాకారా ఉత్సేధ విశేషా రేఖా విశేషా వా. తె. కోణము, మూల.

A. of the eye: ఉపాన్తః. తె. కనుగొలికి.

A. of the lower jaw: హనుకోణః. తె. దౌడకోణము. వి. ముక్కోణముగా తేలియుండు దౌడ ఎముక.

A. of the mouth: జిహ్వప్రాన్తౌ, వదనాన్తౌ, సృక్కిణ్యౌ (ణ్యౌ). తె. చెలిమలు, నోటి చెలిమలు.

Lateral A: పార్శ్వకోణః, బాహ్యకోణః.

Lateral A. of the orbit: భ్రూ పుచ్ఛాన్తౌ తె. కణతల నంటి యుండు కనుబొమ చివరలు.

Obtuse A : స్థూలకోణః. తె. గురుకోణము.

Pubic A : భగకోణః, భగాస్థికోణః.

Rectangle : దీర్ఘచతురశ్రమ్.

Right A : లంబకోణః, సమకోణః.

Triangle A : త్రికోణః, త్రిభుజమ్ తె. ముక్కోణము.

Angular : కోణీయః, కాణిక తె. కోణమునకు సంబంధించిన, మూలకు సంబంధించిన.

Anhydrous : not containing water. అనార్ద్రితః, నిర్జలః. తె. తడిలేని, నీరులేని.

Animal : living being. జంతుః, ప్రాణిః. తె. జంతువు, జీవి, ప్రాణి.

A. heat : ఉష్మా, జంతూష్మా, శరీరోష్మా తె. వేడిమి, శరీర వేడిమి

A. magnetism : ప్రాణోజః తె. శరీరబలము.

Animal : organic being with life and power of motion జీవజన్తుః, ప్రాణిః. తె. జీవి.

Animation : life. చైతన్యమ్, జీవితమ్ సజీవత్వమ్. తె. ప్రాణము, బ్రతుకు, జీవము.

Anisotropal, Anisotropic: doubly refractive. ద్విశారవక్రీకరణీ.

Ankle : joint between foot and leg. ఖుడకః, ఖులకః. వ్యా:- జఙ్ఘాపాద యోస్సన్ధిః, గుల్ఫః. వ్యా:- పార్ష్ణేస పరిగ్రన్థిః. తె. గుత్తి, చీలమండ.

Annular : ring-shaped. అఙ్గులీయః, వలయ సమానాకృతిః. తె. ఉంగరము. వి. ఉంగరమువలె గుండ్రని యాకారముగల అవయవ విశేషము.

A. ligament - see ligament

Annularis : 4th or ring finger. అనామికా, పవిత్రాఙ్గులః(లిః). తె. ఉంగరపు వ్రేలు వి. చేతియందలి నాల్గవ వ్రేలు.

Annulus : a circular opening or margin : చాక్రేయద్వారం వా ముఖమ్, వర్తులద్వారమ్, వర్తులముఖమ్ వా రన్ధ్రమ్. తె. గుండ్రని ద్వారము, గుండ్రని బెజ్జము. వి. ఇవి చక్రము వలె శరీరప్రదేశములందుండు ద్వారములు. అంచుగలిగి ఉంగరములవలె నుండును.

A. abdominalis: Abdominal ring - see ring.

A. abdominis : the inguinal ring - see ring.

A. tracheae : anyone of the cartilaginous rings of the trachea - see ring.

A. tympanicus : the tympanic ring - see ring.

A umbilicus : the umbilical ring - see ring.

Ansa : a loop. శిక్యమ్. తె. ఉట్టి.

A. hypoglossi : జిహ్వాధర శిక్యమ్.

A. subclavia : అక్షకాధర శిక్యమ్.

Antagonism : opposition. పరస్పర విరోధః, విరోధః. తె. విరోధము, వైరము. వి. నామరూప గుణాదులందు ఒకదాని కొకటి విరుద్ధము.

Antebrachium - see antibrachium.

Antenatal: ప్రసవ పూర్వః, ప్రాగ్జన్మ. తె. నీళ్లాడుటకు మునుపు, ప్రసవమునకు పూర్వము, చూలింత.

Anterior : in front of, situated before. అగ్రః. అభిముఖః, పురః, పురస్తన, పురోభాగః, పూర్వః, ప్రాక్.; తె. ఎదురు, ఎదుటి, ముందు, ముందరి.

A. aspect of thorax : అన్తరాధిః, ఉరః. వ్యా:- అన్తరాధే అన్తప్రదేశః, వక్షః. వ్యా:- అన్తరాధేః బాహ్యదేశః. తె. ఎద, ఎదురు ఱొమ్ము. వి. గుండె బయటిభాగము, ఛాతీ, బోర.

A. end : ఉదర్యాగ్రమ్.

A. ends of the ribs : పర్శుకాగ్రాణి. . తె. ప్రక్కటెముకల ముందు భాగము.

A. fontanelle - see fontanelle.

A. furrow - see furrow.

A. madian fissure - see fissure.

A. nares; naris or nostril : నాసానాడీ, నాసాపుటః, నాసారన్ధ్రమ్, నాసావివరమ్, నాసాస్రోతః, పురస్తన నాసారన్ధ్రమ్. తె. ముక్కుపుటము, ముక్కుబెజ్జము, ముక్కురంధ్రము.

A. neuropore : పురస్తనతన్త్రి ద్వారమ్,

A. part of the hand : కరాగ్రమ్. తె. మీఁజేయి, ముంజేయి.

A. perforated substance : పురస్తన వేధితవస్తు.

A. white commissure : పురస్తన శ్వేతసమ్మిశ్రణమ్.

Antiades : see tonsil.

Antibodies : the characteristic constituents of the blood and fluids of immune animals (1) అభిసంస్కార ద్రవ్య విశేషః, అభిసంస్కృతిః. వ్యా:- విరుద్ధ ప్రతిపక్ష గుణవంతం ద్రవ్యమ్. (2) రోగోచ్ఛేదకరం ద్రవ్యమ్. వ్యా:- రోగోత్పాదక బీజోచ్ఛేదక ద్రవ్యమ్.

Antibrachium : forearm. (1)

అగ్రబాహుః, అరత్నిః. వ్యా:- కూర్పరాత్ మణిబన్ధపర్యన్తో భాగః, ప్రపాణికః, ప్రపాణిః. తె. దండచేయి. వి. మోచేతినుండి మణికట్టు వరకునుండు భాగము. (2) ఉపబాహుః, కలావికా. వ్యా:- మణిబన్ధోపరిష్టా చ్చతురఙ్గుల కలావికే ఇతి. ప్రకోష్ఠః. తె. ముంజేయి. వి. మణికట్టు పైన మోచేతికి క్రింద నాలుగు అంగుళముల విస్తారముగనుండు భాగము. Distal third of forearm.

Antihelix : of external ear. అభ్యన్తరపాళీ, ప్రతివలయమ్. తె. వి. కర్ణపాళి - చెవితమ్మె - యొక్క లోపలి లేక బయటిభాగము.

Antitragus : కర్ణపుత్రికా, ప్రతికీలమ్, బాహ్యకర్ణా. తె. గూబ.

Antrum : a cavity in bone అస్థికోటరమ్, అస్థిగుహా, కోటరమ్ తె. ఎముకతొఱ్ఱ, కోటరము, తొఱ్ఱ.

A. of High more - see A. maxillare.

F. mastoideum : the cavity of mastoid bone. కర్ణాస్థికోటరమ్.

A. maxillare : the cavity in the body of the superior maxilla. హనుగర్భకోటరమ్. తె. దవడ ఎముక తొఱ్ఱ.

Anus : rectal exit. అధరగుదః స్థానం. వ్యా:- ఉత్తరగుదా దధో స్థితః, అపానమ్, అపానః, గుదమ్, గుదః, గుదద్వారమ్, పాయుః, పాయుద్వారమ్, పురీషమార్గః, విణ్మార్గః; శకృన్మార్గః. తె. ఆసనము, ముడ్డి, శౌచస్థానము.

Anvil - see bone

Aorta : trunk of the arterial system; the main arterial trunk.

(1) ఆవర్తా, ఆవర్తాధమనీ, ప్రధానావర్తా, బృహద్ధమనీ, బృహల్లోహితికా, మహాధమనీ. వ్యా:- శరీరే విశుద్ధరక్తప్రవాహామూలధమనీ, సాహృదయస్య వామనిలయా త్సముద్భూతా మూలధమనీ. This great artery issuing from left ventricle of heart. (2) బృహద్ధమనీ. వ్యా:- ఏషాహృదయస్య వామకోష్ఠా దూర్ధ్వం ప్రసరతి. (3) ప్రాణవహాధమనీ. తె: పెద్ద రక్తనాళము, బృహద్ధమని. వి. ఇది హృదయములోని వామనిలయము లేక వామకోష్ఠము - ఎడమ అరగది - నుండి బయలుదేరి పైకి వ్యాపించియుండును. గుండెకాయ - హృదయము-నుండి నెత్తురు (రక్తము)ను శరీరమంతట వ్యాపింపజేయును. (4) ప్రధానధమనీ.

Abdominal A. ఉదరధమనీ, ఔదరీమహాధమనీ, కాక్షేయావర్తాధమనీ.

Abdominal portion of A · కాక్షేయూవర్తా (భాగః).

Anterior ventral A. పురస్తాదర్యావర్తా।

Arch of A · తోరణీమహాధమనీ, తోరణ్యావర్తా. తె. ధనురాకారముగ నున్న పెద్ద రక్తనాళము.

Ascending A . ascending portion of aorta. ఆరోహిణీ మహాధమనీ, ఆరోహ్యావర్తా.

Descending A : అవరోహిణీ మహాధమనీ, అవరోహ్యావర్తా.

Dorsal A పృష్ఠ్యావర్తా, బృహద్ధమనీ.

Isthmus of A : see isthmus

Primitive A . ప్రాథమికావర్తా.

Right dorsal A. దక్షిణపృష్ఠ్యావర్తా.

Thoracic A · ఔరసావర్తా. ఔరసీమహాధమనీ.

Thoracic portion of A · ఔరసావర్తా భాగః.

Uterus A · కాక్షేయూవర్తా.

Ventral : ఉదర్యావర్తా.

Aperture : an opening, hole. అయనమ్, ఛిద్రమ్, ద్వారమ్, పథః రన్ధ్రమ్. వ్యాః- కస్మాచ్చిదన్తర్గృహాద్బహిర్గమనార్థం రన్ధ్రమ్. యథా— నవద్వారణి. అథవా అన్తర్గృహాదన్తర్గృహం ప్రతిగమనార్థం ద్వారమ్. తె. కన్నము, దారి, ద్వారము, బెజ్జము, బొక్క. వి. లోనినుండి బయటికిగాని, శరీరములోపల ఒక చోటనుండి వేరొక చోటికిగాని పోవుట కేర్పడియుండు కన్నము; కలుగు.

A. of the body : కాయరన్ధ్రాణి. తె. శరీరమునగల వివిధ రంధ్రములు.

A. of alveolar canals : ఔమూఖలస్రోతద్వారాణి.

Auriculo ventricular A : కర్ణక కోష్ఠకాన్తరద్వారమ్, కర్ణికాజఠరకాద్వారమ్.

Cloacal. A మలమూత్రద్వారమ్.

Different carrying. A : శరీరధాత్వావకాశాః. తె. రసరక్తాది ధాతువులను శరీరమున వ్యాపింపజేయు నాళరంధ్రములు.

Inferior A. of lesser pulvis: కటీగుహాధరద్వారమ్.

Large external A. of the body (nine in number). మహాఛిద్రాణి. తె. నవద్వారములు. వి. శరీరమున బయటికి కనబడు తొమ్మిది పెద్ద రంధ్రములు.

Left auriculo-ventricular A: వామకర్ణకకోష్ఠకాన్తరద్వారమ్.

Minute. A : సూక్ష్మఛిద్రాణి, సూక్ష్మరన్ధ్రాణి. తె. రోమకూపములు వి. చర్మముపై కనబడుచుండు సన్నని చిల్లులు. వీనినుండి శరీరము

లోని మలినములు చెమటరూపమున వెడలుచుండును.

Pleuro pericardiac medial A పార్శ్వకోపరిహృదయాన్తరద్వారమ్.

Pleuro peritonial A : పార్శ్వకోపరితుణ్డియద్వారమ్.

Right auriculo-ventricular A : దక్షిణకర్ణకకోష్ఠ కోన్తర ద్వారమ్.

Superior A. of the lesser pulvis. కటీగుహాన్తరద్వారమ్.

Uro-genital A : వస్త్యుపస్థీయ ద్వారమ్.

Apex : peak, extremity of anything. అగ్రమ్, చూడా, మస్తకమ్, శిఖరమ్, శీర్షమ్. తె. అగ్రము, కొన, చివర, తుద, మొన. శిఖరము, శిఖరాగ్రము.

A of the axilla. అంసమూలమ్. తె. భుజము. వి. ప్రగణ్ఠాస్థిశిఖర భాగము.

A. of the bladder: వస్తిశిరః, వస్తిశీర్షః.

A. of the heart: హృదయ శీర్షమ్

A. of the lung: పుప్పుసచూడా, శ్వాసాశయాగ్రమ్.

A. of the nose. నాసాగ్రమ్, నాసికాగ్రమ్. తె. కొనముక్కు, ముక్కుకొన, ముక్కుచివర, ముక్కుమొన.

Apical : belonging to apex. అగ్రీయ, మస్తకీయ, శిఖరీయ, శీర్షీయ. తె. అగ్రమునకుచెందిన, శిఖరమునకు సంబంధించిన.

A. part : శీర్షఖణ్డమ్.

Aponeurosis . a fibrous expansion of a tendon; a fibrous or membranous sheet.

(1) ఉల్లోచః. వ్యా:- ప్రాయోవిస్తారిత కణ్డరాగ్రరూపం వస్నసా తన్తు వితానముచ్యతే, సఏవ కణ్డరా విస్తారస్తావద వితానశ్చ. కణ్డరా వితానాః కలాకణ్డరాః. తె. కండర విశేషము.

(2) పృథ్వీ, పృథుస్నాయుః, పృథులాస్నాయుః. తె. మాంసపుబిళ్ల, స్నాయువు. వి. ఇది అణగి వెడల్పుగానుండును.

Epicranial A: కరోట్యుల్లోచః.

Glca-aponeurotica : కరోట్యుల్లోచః.

Palmar A · కరతలికోస్నాయుః.

Apparatus, Instruments : a number of organs which act together in the performance of a definite function ఉపకరణాని, సాధనాని. వ్యా:- ప్రత్యఙ్గసఙ్ఘాతాయాని నిర్దిష్ట వ్యాపార నిర్వహణార్థం అన్యోన్యం సహాయీజ్యన్తే. తె. ఉపకరణములు.

Central A : కేన్ద్రసాధనమ్.

Golgi A - see body.

Apparent బాహ్యలోకః. తె. బయటి కగపడుచున్న.

Appendage : that which is attached to an organ as a part of it. అనుబన్ధాఙ్గమ్, ఉపాఙ్గమ్, ఉపాహితభాగాఙ్గమ్. తె. అనుబంధాఙ్గము, చేర్చబడిన అవయవము లేక అవయవ భాగము.

Appendices epiploicae : అన్త్రపుచ్ఛికా. తె. పేగు చివరభాగము.

Appendix. అన్త్రపుచ్ఛః, ఉణ్డుకపుచ్ఛమ్, ఉపాన్త్రమ్, కృమి, కృమికః, కృమిహ్యాశయః, పుచ్ఛః స్థూలాన్త్రిక దేశః. తె. గిలక. వి. చిన్న పేగు పెద్దపేగు కలియుచోట నొక ముడిగా చేర్పబడిన వృద్ధ్యనుబంధము.

A. Vermiformis: the worm-shaped process of the cecum. ఉండుకపుచ్ఛః. ఉపాన్త్రమ్. తె. వి. పేగుకు అనుబంధమైన మొండితోక.

Apposition the state of being fitted together. అభిసన్ధానమ్, అనుయోజనమ్. తె. అన్వయము, కలయిక, పొందిక. వి. సరిగా కలసి పొందిక గల స్థితి.

Aqua : water. జలమ్. తె. నీరు.

Aqueduct : a canal (1) నాళః. తె. కాలువ. (2) అమ్బునాళః, అమ్బునాళికా. తె. చిన్న లేక సన్నని నీటికాలువ, జలవాహి, నీటిగొట్టము.

A. of sylvius సురఙ్గికా. తె. చిన్న సొరంగము. the canal leading from the third to the fourth ventricle of the brain. మస్తిష్క నిలయ సుఙ్గికా. వ్యా:- యాతు తృతీయ చతుర్థ నిలయాను బన్ధితా.

Aqueous . watery; blonging to water. అమ్బు, అమ్బుసమ్బన్ధి, జలీయ. తె. నీటి, నీటికి చెందిన.

A. Humor: the fluid in the anterior chamber of the eye. తేజోజలమ్, నేత్రోదమ్. తె. కంటిలో నల్లగుడ్డు ముందు తిత్తిలో నుండు నీరు.

Arachnoid: web. (1) జాలం, తంతుసంతతిః. తె. అల్లిక. వి|| resembling web · నేత నేసినట్లుండు పొరవిశేషము.

A membrane : the serous membrane of the brain and cord; serous membrane lining the dura mater and enveloping brain and spinal cord. గోర్దనాళావరణికలా, లౌతికలా. వ్యా:- మస్తు లుఙ్గధరాయా భిన్న నామ. తె. మెదడు పొర. వి. ఇది మెదడును, వెన్నుబామును చుట్టుకొనియుండు పలచని పొర; మూడువిధముల పొరలలో నొకటి.

Arch : అర్ధచక్రమ్ (ః), అర్ధవలయమ్,

గోలఖణ్డమ్, చాపః, చాపకతోరణమ్. తె. కమాను, విలువంపు, విల్లు

Arches : a term applied to various curved portions of the body. అర్ధచక్రాణి. వ్యా:- చక్రార్ధాకారాణ్యర్ధవలయాకారాణి చాపవక్రాణి వా అఙ్గాని తాన్యేవ చాపకాని తోరణాని చ. తె. వి. కమాను లేక విల్లువలె అర్ధచంద్రాకారముగనుండు వివిధ శరీరావయవ భాగములు.

Alveolar A : దన్తపిణ్డికా, దన్తాధారః, దన్తోలూఖలపఙ్క్తిః, దన్తోలూఖలమణ్డలమ్. తె. పనుగుంట వరుస. వి. పళ్లుయిమిడి (గుచ్చుకొని) యుండుటకు రోలువంటి చిన్న గుంటల వరుస. ఈవరుస అర్ధచంద్రాకారమును బోలియుండును.

Anterior A · పురస్తనవలయఖణ్డః.

Aortic A . అవర్తార్ధచక్రమ్, తోరణ్యావర్తా. తె. వి. కమాను లేక వింటియాకారమున నున్న పెద్ద రక్తనాళము.

A. of aorta - see aortic arch.

A. of vertebra : కశేరుకార్ధచక్రమ్, పృష్ఠ్యర్ధచక్రమ్. తె. వెన్ను విల్లు. వి. ధనురాకారమైన వెన్నుపూస.

Carotid A : కారోట్యర్ధచక్రమ్

Costal A : పర్శుకీయచాపః.

Deep planter venous A : నిమ్నపాదతలీయార్ధ చక్రమ్.

Deep volar A . కరతలధానుషీ గమ్భీరా, నిమ్న పాణితలీయార్ధ చక్రమ్.

Dorsal aortic A : పృష్ఠ్యావర్తకీయార్ధచక్రమ్, పాదపృష్ఠస్య మర్ధ చక్రమ్, పాదపృష్ఠ్యార్ధచక్రమ్.

First aortic A: ప్రథమావర్తీయార్ధచక్రమ్.

First pharyangeal A : గళీయ ప్రథమార్ధ చక్రమ్.

Glosso palatine A · జైహ్వతాలవ్యార్ధ చక్రమ్.

Hyoid A : కాణ్ఠికార్ధ చక్రమ్, ద్వితీయార్ధచక్రమ్, వక్త్రీయార్ధ చక్రమ్.

Mandibular A : అధరహన్వార్ధ (హానవార్ధ) చక్రమ్, ప్రథమార్ధ (గళీయ ప్రథమార్ధ) చక్రమ్, మాణ్డబలార్ధ చక్రమ్.

Neural A : తన్త్రికోశకాచాపః.

Oral A : వక్త్రీయార్ధచక్రమ్.

Palmar A : కరతలచాపః.

Pharyngeal A : గళీయార్ధ చక్రమ్.

Planter A : పాదతలీయార్ధ చక్రమ్.

Planter cutaneous venous A : పాదోదర్య గాదార్ధచక్రమ్, పాదోదర్య త్వాచార్ధచక్రమ్.

Posterior A : పశ్చిమ (వల

యస్య), ఖణ్డః.

Primitive costal A : ప్రాథమిక పార్శ్వకార్ధచక్రమ్ ।

Right aortic A : దక్షిణావర్తీయార్ధచక్రమ్.

Second pharyngeal A : కాణ్ఠికార్ధచక్రమ్, ద్వితీ(గళీ)యార్ధచక్రమ్.

Super ciliary A : భ్రూత్తరార్ధచక్రమ్.

Superficial volar A : కరతల ఉత్తరార్ధచక్రమ్.

Third aortic A : తృతీయావర్తీయార్ధచక్రమ్.

Vertebral A : కశేరుకా చాపః.

Visceral A : ఆజ్ఞికార్ధచక్రమ్, గళీయార్ధచక్రమ్.

Zygomatic A : గణ్డ(గాణ్డ)చక్రమ్.

Archenteron . ఆద్యాన్త్రమ్.

Archeocyte - see cyte.

Arcuate : bent like an arch. చాపః. తె. విల్లు. వి. విల్లువంటి వంపు.

A. fibre - see fibre.

A. line - see line.

Eminentia A - see eminentia.

Area : any space with boundaries అభ్యన్తరస్థానమ్, అధిష్ఠానమ్, క్షేత్రమ్, క్షేత్రః, క్షేత్రకమ్, క్షేత్రకః. వ్యా:- అల్పమాత్రం తలమ్, ప్రదేశః, ప్రాన్తదేశః, స్థలవిశేషః. తె. ఆవరణము, ఉనికిపట్టు, ప్రదేశము, స్థానము. వి. నలువైపుల హద్దులుగల శరీర ప్రదేశము.

Anterior nasal A : పురస్తన నాసాకుహరమ్. తె. ఎదురుముక్కోడు.

A. of the body : అఙ్గప్రదేశః, గాత్రప్రదేశః. తె. శరీరమందలి ఒక స్థలము.

A. vasculosa . నాళీక్షేత్రమ్.

Cohnheim's A : కోణక్షేత్రమ్, క్షేత్రాణి.

Different As. of the brain: అభ్యన్తరకరణాయతనాని. వ్యా:— మనోబుద్ధ్యహఙ్కారస్థానాని. (సు ఉ. 40-$3\frac{1}{2}$)

Embryonic A - see Embryonic. (భ్రూణప్రదేశః. తె. పిండముండే స్థలము.

Jaw joint A : హనుసంధిక్షేత్రమ్, తె. అంకళ్ళు.

Lower jaw A : అధోహను ప్రదేశః, తె. క్రిందిదవడ ప్రదేశము.

Lumbar A : కటిప్రదేశః. తె. నడుము, నడ్డి.

Olfactory A · ఘ్రాణక్షేత్రమ్.

Primary A : ప్రాథమికక్షేత్రమ్.

Prostatic A : ప్రాస్థ(స్థి)ఖణ్డః, ప్రాస్థక్షేత్రమ్, పోషణికాక్షేత్రమ్.

Pubic A : కామపీఠమ్. వ్యా:-

sity.

Sacrum : the triangular bone situated at the fifth lumbar vertebra and the coccyx. It consists of five vertebrae fused together. త్రికమ్, బిమ్బకమ్. వ్యా- అధర త్రికమ్ ఇతి (డల్హణః). కటీశ్రోణికాణ్డ భాగే త్రికం ప్రసిద్ధమ్. (సు. శా. 5.16). త్రికస్య పృష్ఠాంశస్థో మధ్యకీలః, చక్రకీలా. తె. ముడ్డి ఎముక, ముడ్డిపీట, ముడ్డిపూస. వి. ముక్కోణము ఎముక. ఇది వెన్నుపూసల చివర ఐదు చిన్న ఎముకలచే కదదీయబడినది. see bone.

Saddle : పర్యాణమ్, పర్యాణకః. తె. పల్లము. వి. గుఱ్ఱపుజీని ఆకారములో నుండు అవయవ విశేషము.

S. joint : a concavoconvex articulation. నతోన్నతసన్ధిః - see joint.

S. nose : nose with deep or flattend bridge. పర్యాణనాసికా, సజ్జానాసికా. తె. చట్టిముక్కు.

Sagittal : like an arrow. ఉత్తర సాయకః. వ్యా:- శర ఇవ సాయకాకారః. తె. బాణమువంటి అవయవ భాగము.

S. plexus - see plexus.

S. sinus - see sinus.

S. suture - see suture.

Saliva : the secretion of the salivary glands. spittle. (1) ముఖస్రావః, లాలా, వక్త్రాసవః. (2) నిష్ఠ్యూతమ్. తె. చొంగ, జొల్లు, లాలాజలము. వి. నోటిలో ఊరెడు ఉమ్మినీరు, ఉమ్మి, లాల.

Salivary : belonging to the saliva . లాలా, లాలా సమ్బన్ధీ, వక్త్రాసవః. తె. ఉమ్మికిచెందిన, లాలాజలమునకు సంబంధించిన.

S. duct - see duct.

S. gland - see gland.

Salpinx : follopian tube or eutachian tube - see tube.

Salt : లవణః. తె. ఉప్పు.

Bile S : పిత్తలవణము.

Sanguine : sanguineous, bloody. ఉష్ణప్రకృతిః, రక్తమయః, రక్తప్రకృతికః, లోహిత. తె. ఉష్ణస్వభావముగల, నెత్తురుగల.

Sanguis : blood : రక్తం, లోహితమ్. తె. నెత్తురు, రక్తము.

Saphena - see vein.

Saphenous : pertaining to the saphena : జంఘాకాణ్డ, జంఘాకాణ్డీయ. తె. పిక్కకుచెందిన.

S. nerve - see nerve.

Sarco : flesh : (1) కేసరః, పిశితం, మాంసమ్. (2) మాంసమయః, మాంసీయ. తె. మాంసము, మాంసముతోకూడిన.

S. lemma : కేసరాలమ్భా. వ్యా:- ఛదావృత మృద్వ్యాకుఞ్చన ధర్మబద్ధ వస్తు. a delicate membrane surrounding muscle - fibres. తె. పేశీతన్తు (పీచుకణము) చుట్టు నుండు మృదువైన పారదర్శకమగు పొర.

S. mere : కేసరఖురా.

S. plasm : కేసరబలాసా. వ్యా:- కేసరతన్తుకా న్తరవస్తు.

S. plast : మాంసధాతుకణః, మాంసధాతుబీజకోశః.

S. style : కేసరతన్తుకః.

Sarcology : science of the soft tissues of the body. మాంసధాతువిజ్ఞానమ్.

Scala tympani : పాటహసోపానమ్.

Scale : a small lamina of detached cuticle. చర్మచేలీ, చిపిటికా, శకలమ్, శల్కలమ్. తె పొర, పొలుసు, ముక్క.

Scalenus : muscle of the neck- see muscles.

Scalp : skin of the head. The integument covering, the cranium. శిరఃకఞ్చుకః, శిరోఽక్షి చర్మ, శిరోవల్కలమ్. తె. నెత్తి చర్మము, తలపైచర్మము.

Scaly : శకలాకృతిః, శకలావృతః.

Scapula : a large, flat, triangular bone of the shoulder- see bone.

Spine of S. అంసప్రాచీరకమ్, అంసాగ్రలః.

Scapular : అంసఫలకీయః. belonging to the shoulder blade.

Inter Sca. region : see region.

Scarlet : శోణవర్ణః. వ్యా:- ధమనీభ్యః క్షరితరక్తస్యవర్ణః. తె. ఎఱుపువన్నె. వి. మంచి రక్తనాళములనుండి కారు నెత్తురు రంగువంటి ఎఱుపు వన్నె.

Sciatic : pertaining to the ischium. ఆసన, సైక్థికీ.

S. nerve - see nerve.

Sclera: the "white" of the eye. The white, tough outer membrane of the eyeball, the opaque bluish - white fibrous outer coat of the eyeball covering the posterior five sixths. నేత్రసితమ్, శుక్లపటలమ్, శుక్లమణ్డలమ్, శ్వేతగోలః, శ్వేతపటలమ్, శ్వేతమణ్డలమ్, సితమ్. తె. కంటితెలుపు, తెలుపు, తెల్లపొర, శుక్లపటలము. వి. కంటి గ్రుడ్డుపైనుండు తెల్లని గట్టిపొర, తెల్ల గ్రుడ్డు, అక్షిబాహ్యపటలము. ఇది ఆరింటిలో ఆయిదువంతుల కను గ్రుడ్డును గ్రమ్మియుండును.

Sclerocornial junction : శుక్లకృష్ణగత సన్ధిః. తె. వి. కంటిలో తెల్ల

గ్రుడ్డు నల్లగ్రుడ్డు కలియు చోటు, సంధి.

Scleromenix : the dura matter.

Sclerosis : కాఠిన్యము. తె. గట్టి దనము.

Sclerotic : belonging to the sclera.

S. circle : శుక్లమణ్డలమ్. sclera.

S. coat · the sclera.

Scrotal : pertaining to the scrotum. అణ్డకోశీయ, ముష్కకోశీయ. తె. వట్టకాయసంచికిచెందిన.

S. sac - see scrotum.

S. raphe - see raphe.

Scrotum : the pouch in the male which contains the testicles. అణ్డకోశః, చర్మకోశః, ఫలకోశః, ముష్కకోశః, వృషణకోశః. వ్యా :- శిథిల చర్మావృత వృషణకోశః. ఏష స్థూల కలామయ పుటకః. తె. అణ్డకోశము, వట్టకాయలతిత్తి, సంచి.

Dartos of S : ముష్కతూణికా.

Two lateral halves of the S: ప్రావరణకోశౌ, ఫలకోశౌ. తె. అణ్డకోశము లోపల ప్రత్యేకముగా నుండు తిత్తులు, సంచులు.

Scutum : thyroid cartilage - see cartilage.

Seam : సీవనీ. seams : సీవన్యః. a line formed by sewing together two pieces of cloth, a line of junction or suture. వ్యా :- వస్త్రఖణ్డాది ప్స్యూవ ద్వయోరన్యోన్య సీవనోత్పన్నా, నిమ్నోన్నతా వా దృశ్యమానా రేఖా. తె. (1) అతుకు (2) కుట్టు, గీత, చార. వి. కుట్లచార. రెండు గుడ్డముక్కల నతికి కుట్టగా నేర్పడు ఎగుడు దిగుడు గీతల వంటి చార. ఇది పుర్రె ఎముకలలో కానగును.

Sebaceous : pertaining to fat. వసా సమ్బన్ధీ. తె. క్రొవ్వుకు చెందిన.

Sebum : త్వగ్వసా, త్వగ్వసా స్రావః. తె. తోలుచమురు. వి. చర్మమందలి చమురు, చర్మమునుండి చమురు గారుట. ఇది చర్మగ్రంథులం దుత్పత్తి యగును.

Secondary : అప్రధానః, అముఖ్యః, గౌణః, ద్వితీయః. తె. తక్కువైన, తరువాతి, ముఖ్యముగాని.

Sec. oocyte : ద్వితీయయూవతః.

Sec. origin - see secondary secretions.

Sec. secretions - see secretion.

Secretion : a substance secreted by glands and follicles.

Secretions (pl). ద్రవాః, నిష్యన్దనాని, విసర్జనాని, స్రవణాః, స్రావాః, స్యన్దనాని. తె. ఊటలు, ద్రవములు, స్రావములు. వి. శరీర

గ్రంథుల నుండి చెమర్చుచుండు, కారుచుండు ఊటలు గా వచ్చుచుండు నీటివంటి పలుచని వస్తువులు. ఇవి శరీరారోగ్య అనారోగ్యములకు కారణములు. ఉత్సర్జనములు.

Appetite Se: మనఃస్ఖలనమ్. మానసికస్రావః. తె. కోరికలూరుట, కోరికలజాలు.

External Se: బహిః స్రావః, బాహ్యోత్సర్జనః. తె. వెలియూట.

Gastric Se: జాఠరద్రవాః.

Internal Se: (1) అన్తఃస్రావాః. తె. లోయూటలు. వి. శరీరము లోపల కొన్ని గ్రంథులనుండి ఊరి చెమరుచుండు ద్రవములు, ఊటలు. (2) ఓజః స్థానాని, ఓజాంసి. ఓజో ద్రవ్యాణి (భేలః) తె. ఓజో ద్రవ్యములు. వి. ఓజస్సుగల రసరక్తాది పదమూడు శారీరకద్రవ ఘన ద్రవ్యములు.

Internal Se. of ovary. ఆర్తవమ్, శోణితమ్. వ్యా:- అణ్డాశయస్థం సారవస్తు విశేషమ్.

Intestinal Se: ఆన్త్ర నిష్యన్దః, ఆన్త్రస్రావః. ఓజఃస్థానమ్ తె. వి. ప్రేవులలో (పేగు) చెమర్చుచుండు ద్రవవిశేషము.

Psychical Se: మానసికస్రావః.

Secondary Se: secondary origin. ఉపధాతవః. తె.వి. పాలు, ఋతురక్తము మున్నగు ఉపధాతువులు ఇవి రసాది సప్తధాతువులలో పుట్టును.

Se. of the pituitary body: పీ-పై-యూషద్రవః.

Se. of the thyroid gland: కాకలద్రవః.

Section: a division by cutting, dissection: అఙ్గచ్ఛేదః, ఛేదనమ్, పరిచ్ఛేదః, పృథక్కరణమ్, విచ్ఛేదః. వ్యా:- ఛిన్నాంశః, భాగశఃఛేదనమ్. తె. కోత, భాగము. వి పరిచ్ఛేదము, కత్తితో కోయగా నేర్పడిన ముక్క లేక భాగము.

Secundins: the after-birth. అపరా, జరాయుః - see after-birth.

Sedentaria ossa: the ischia and coccyx · స్ఫిగస్త్రికా.

Seed - see semen.

Segment a small piece, section, part. ఖణ్డః, భిత్తమ్, శకలమ్. తె. ఖండము, ముక్క, తునక.

Cervical Seg: గ్రైవభిత్తమ్.

Intermodal Seg: పర్వాన్తర ఖణ్డః.

Lower Seg. of the rectum: అధరగుదఖణ్డః.

Lumbar Seg: నైతమ్బభిత్తమ్.

Medullary Seg: మజ్జాచ్ఛదఖణ్డః.

Primitive Seg: ప్రాథమికఖణ్డః, ప్రాథమికభిత్తమ్.

Sacral Seg : త్రైకభిత్తమ్.
Supra occipital Seg : పృష్ఠకోష్ఠ ఉత్తరఖణ్డః (ఖణ్డత్వమ్).
Thoracic Seg: ఔరసభిత్తమ్.
Upper Seg. of the rectum : ఉత్తర గుదఖణ్డః
Uterine Seg . గర్భాశయఖణ్డః.

Segmental : ఖణ్డీయ, భైత్త. తె. తునక, తునకకు చెందిన.

Segmentation : the process of forming segments. అణువిభాగ క్రమః. తె. (I) కణవిభజనక్రమము. వి. చిన్న తునకలుగ విడిపోవు క్రమము, పద్ధతి. (2) ఫలదీకరణము నకు చెందిన.

Sella turcica : pituitary fossa of sphenoid bone. దృష్టి నాడీ పరిఖా, పర్యాణికాఖాతమ్, పైయూషనిమ్నికా, పోషణికాఖాతమ్.

Semen : (L. seed) the secretion from the testicles and accessory male organs, the fecundating fluid of the male. అన్త్యధాతుః, ఇన్ద్రియమ్, ఓజఃస్థానమ్, తేజఃస్థానమ్ (భేలః), పుంబీజమ్, పుంరేతః, (హేమాద్రిః), బీజమ్, రేతః, వీర్యమ్, శుక్రమ్. వ్యా:- పితు ర్ద్విత్రిబిన్దుకోఽస్థం రేతః. (అ. హృ. సూ. 1-9 అరుణదత్తః) తె. బీజము, వి త్తనము, వీర్యము, శుక్రము. వి. ఇది రసాది ధాతువులలో చివరి ఏడవధాతువు. గర్భధారణకుపయోగ పడు ఉత్కృష్ట ధాతువు. 1. బీజమ్. వ్యా:- గర్భోత్పాదకాంశః. 2. రేతః. వ్యా:- రత్యర్థాంశః. తె. రేతస్సు. 3. శుక్రమ్, శుక్లమ్. వ్యా:- ప్రజననార్థ శ్చరమోధాతుః. తె. వి. పిల్లలు పుట్టుటకు పనికివచ్చు చివరి ధాతువు. శుక్రలక్షణమ్:- స్ఫటికాభం, ద్రవం, స్నిగ్ధం, మధురం, మధుగన్ధి చ శుక్ర మిచ్ఛంతి కేచిత్తు తైలక్షౌద్రనిభం తథా (సు. శా. 2. 11$\frac{1}{2}$) తె. వి. శుక్రము స్ఫటికము వలె తెల్లగను, నునుపుగను, తియ్యగను, తేనెవాసనయు గలిగి పలచగ నుండును. నూనె తేనెరంగులతో నుండునని కొంద ఱాచార్యుల మతము. మిథునక్రియ - స్త్రీపురుష సంయోగము-వలన బుట్టు శరీర వేడిమిచే వృషణములందు కరిగి శిశ్నము నుండి కారు చిక్కని బియ్యపుగంజి వంటి పలచని తెలుపు వస్తువు.

Semi : half. అర్ధ, అర్ధః. తె. సగము.
S. canal : ఒకవైపు తెరచియుండు నాళము.
S. circle - see circle.
S. circular canal - see canal.

Semilunar : crescent - shaped. అర్ధచన్ద్రః, చన్ద్రార్ధః. తె. అర్ధ చంద్రాకారముగానున్న.

S. bone - see bone.
S. canal - see canal.
S. cartilage - see cartilage.
S. crescent : అర్ధచన్ద్రాకృతిః.
S. crest - see crest.
S. duct - see duct.
S. ganglion - see ganglion.
S. gyrus - see gyrus.
S. lobe : a lobe on the upper cerebellar surface - see lobe.
S. notch - see notch.
S. valve - see valve.

Semimembranosus : a muscle of the thigh - see muscle.

Seminal : belonging to semen. ఐన్ద్రియః, బీజకః, బైజ్యః. వ్యా:- శుక్రసమ్బన్ధి. తె. శుక్రమునకు చెందిన.
S. cyst : a cyst containing semen. శుక్రాశయః. తె. వీర్యపు తిత్తి, శుక్రాశయము. వి. శుక్రము ఉత్పత్తియై నిలవయుండు సంచి.
S. fluid - see fluid.
S. globules, S. granules : minute globules seen in semen : రేతః కణికాః, సూక్ష్మ శుక్రాణవః, సూక్ష్మశుక్ర పరమాణవః. తె. సూక్ష్మ వీర్యరేణువులు. వి. శుక్రములోని చిన్న పలుకులు, శుక్ర పరమాణువులు.
S. vesicle - see vesicle.

Semination : intermission of semen into uterus. గర్భాధానమ్. వ్యా:- గర్భాశయే శుక్ర మోచనమ్. తె. గర్భాదానము. వి. గర్భాశయమున - కుక్షిలో - శుక్రము విడుచుట.

Sensation : 1. ఇన్ద్రియగ్రహణమ్, ఇన్ద్రియ జ్ఞానమ్, ఇన్ద్రియ బోధః, చైతన్యమ్, వేదనా, సంవేదః. తె. అనుభవము, అలికిడి, ఇంద్రియ జ్ఞానము, ఇంద్రియబోధము, వేదన, సంవేదనము. 2. రూపరసాదీనాం జ్ఞానమ్. తె. వి. రూపరసా సాదుల తెలివిడి.

Sense : one of the perceptive faculties. Senses. (pl). అక్షాణి, ఇన్ద్రియాణి, కరణాని, జ్ఞానేన్ద్రియాణి బుద్ధీన్ద్రియాణి. తె. (1) కరణములు, జ్ఞానేంద్రియములు, బుద్ధీన్ద్రియములు, సాధనములు. వి. ఇవి ఐదు - త్వక్చక్షుర్జిహ్వాశ్రోత్ర నాసికలు. (2) జ్ఞానము, తెలివి.
Cognative Ss : బుద్ధీన్ద్రియాణి.
Conative Ss : కర్మేన్ద్రియాణి.
S. objects : అర్థాః. తె. అర్థములు.
S. organs - see organ.
S. of alfaction : ఘ్రాణేన్ద్రియమ్, ఘ్రాణమ్. తె. ముక్కు.
S. of audition : శ్రవణేన్ద్రియమ్. శ్రోత్రమ్. తె. చెవి.
S. of taste : రసనేన్ద్రియమ్, రస

నమ్. జిహ్వా. తె. నాలుక.

S. of touch. (1) స్పర్శేన్ద్రియమ్, స్పర్శనమ్, త్వక్. తె. చర్మము, తోలు.

S. of touch: (2) త్వగిన్ద్రియమ్, స్పర్శేన్ద్రియమ్. తె. వి. అంటు లేక త్రాకుడును తెలిసికొను ఇంద్రియము, సాధనము. ఇది సర్వశరీరమును, విశేషముగ చర్మమును ఆశ్రయించి యుండును.

S. of vision: దర్శనేన్ద్రియమ్, దర్శనమ్, నేత్రమ్. తె. కన్ను.

Special S: ప్రత్యేక జ్ఞానాయతనాని.

Tactile S: స్పర్శేన్ద్రియమ్,

Sensorium: (1) a common centre of sensations. (2) the seat of sensation. the brain, brain & spinal cord, or greymatter of these (biol), whole sensory apparatus including nervous system. ఇన్ద్రియ స్థానమ్, చేతనాశయః, చైతన్యాస్పదమ్, జ్ఞానాగారః, జ్ఞానాశయః. తె. విషయగ్రహణ స్థానము. వి. మెదడు, వెన్నుబాము, నాడీమండలము, వీనియందుండు బూడిదవర్ణపు వస్తువు, ఆధారములు.

Sensory: ఐన్ద్రిక, జ్ఞాపక, ప్రజ్ఞావహా, సంవేద తె. ఇన్ద్రియ సంబంధమైన, జ్ఞాపకమునకు చెందిన, విషయసంబంధమైన.

Septum. a partition between two cavities, a dividing wall or membrane. పటః, మర్యాదా, విభాగకః, విభాగః, సంవిభాగః. వ్యా :- 'అన్యోన్య విభాజక భిత్తయో మర్యాదా. యథా :- కలాకీకసాది రూపాః. తె. అడ్డు, గోడ, తెర, విభాజకము, హద్దు. వి. రెండు రంధ్రములను, నాళములను ఎడబఱచి నడుమనుండు గోడవంటి తెర. ఇది సన్నని మాంసపుపొర, లేక ఎముక మొదలగు రూపములలో నుండును.

Distal bulbous S: విప్రకృష్ట బుద్బుదీయ మర్యాదా.

Inferior S: అధరమర్యాదా.

Inter muscular S: పేశ్యన్తర విభాజకః.

Inter orbitonasal S: కణ్డనాసాన్తర మర్యాదా.

Intra ventricular S: కోష్ఠకాన్తర మర్యాదా.

Nasal S: ఊర్ధ్వశుక్తికా, నాసామధ్యమ మర్యాదా, నాసాపటః వా సంవిభాగః. తె. ముక్కుగోడ, ముక్కు తెర. వి. ముక్కురంధ్రములను వేరుపరచు గోడవంటి లేత ఎముక. నాసికావిభాజకము లేక తెర.

Rectovaginal S: the tissue between the rectum and vagina. గౌదభాగేయ మర్యాదా.

వ్యా :- గుదభగయోర్మధ్యస్థాకలా వామర్యాదా వా విభాజకః. తె. గొద భాగేను విభాజకము. వి. గుదయోను లకు మధ్యనున్న మాంసపు పొర, తెఱ.

S. intermedium : మధ్య మర్యాదా.

S. lucidum - see S. pellucidum.

S. nasi - see Nasal S.

S. pellucidum : the wall between the lateral ventricles of the brain. శ్వేత మర్యాదా, స్వచ్ఛవిభాజకః. వ్యా:- గోర్ధపార్శ్వ కోష్ఠక మధ్యస్థా అచ్ఛ ప్రభా వా స్ఫటిక ప్రభా మర్యాదా. తె. వి. మెదడు ప్రక్క అరలనడిమి తెర. ఈపొర నిర్మల స్ఫటికకాంతు లీనుచుండును.

S. primum of heart : ప్రథమ మర్యాదా.

S. scroti : ముష్కమర్యాదా.

S. spurium - see spurious S.

S. transversum : తిరశ్చీన మర్యాదా.

S. ventriculorum: the partition between the two ventricles of the heart. కోష్ఠక మర్యాదా. వ్యా :- హృదయ కోష్ఠయోర్మధ్యస్థః విభాజక కలావిశేషః. తె. కోష్ఠక విభాజకము, అఱ తెఱ. వి. గుండె కొయ్య-హృదయములోని అఱలు-గదుల-మధ్య తెఱవలెనుండు మాంసపుపొర.

Sinous S : పారిశీయ మర్యాదా.

Spurious S : మిథ్యామర్యాదా.

Urorectal S : వస్తిపాయ్వన్తర మర్యాదా.

Seralbumin : the albumin of the blood · రక్తధవళకమ్, రక్తవసా. తె. వి. నెత్తురులోని శ్వేత ధాతువు.

Serosa : a serous membrane. అనుత్వక్.

Serous : having the nature of serum · సరస. తె. రసివంటి పలచనివస్తువు.

S. cavity . a large lymph-space - see cavity.

S. effusion - see serum.

S. exudation - see serum.

S. fluid: normal lymphatic fluid.

S. membrane - see membrane.

S. sac - see sac.

Sub S. tissue - see tissue.

Serum : thin transparent part of blood, the fluid constituent of the blood separated by coagulation: (1) త్వగమ్భః, పిచ్ఛా, రక్తద్రవః, రక్తమణ్డమ్ (గణనాథః),

రక్తమస్తు, రక్తరసః, రక్తామ్బుః, (2) చర్మోదకమ్, లసీకా. వ్యా :- (క) యత్తు త్వగన్తరే వ్రణగతం లసీకా శబ్దంలభతే (చ.శా. 7-15 గద్యాంశః). (గ) యన్మాంసత్వగన్తరే ఉదకం, త ల్లసీకాశబ్దం లభతే. (చ. ని. 4-37 చక్రః). (చ) పిత్తేన పక్వస్మామాంసాత్ స్రవదుదకం "లసీకా" ఇత్యుచ్యతే. (సు సూ. 21-7 వ్యాఖ్యానే డల్హణః). సరమ్. సరః. తె. (1) నెత్తురుపేట, రసి, రసిక, సొన. వి. రక్తము విఱిగిన నీరు, (2) సారము రక్తముగా మారు అన్న రసముయొక్క సూక్ష్మసార భాగము.

S. albumin : సరధవలకః.

S. albumin : the albumin of blood - serum. రక్తరసాద్య ధాతుః. తె. రక్తరసప్రోటీను.

S. of blood : రుధిరమస్తు, రుధిర సారః.

Sex : male or female sign, the condition of being either male or female. లిఙ్గమ్, స్త్రీ పురుషభేదః. వ్యా :- స్త్రీయోవా పుంసశ్చ చిహ్నమ్. తె. గురుతు. వి ఆడ లేక మగగురుతు, స్త్రీ పురుష భేదము.

Female S : స్త్రీజాతిః, స్త్రీలిఙ్గమ్.

Male S: పుంజాతిః, పుంలిఙ్గమ్.

S. cell - see cell.

S. characters (secondary) : వ్యఞ్జనాని. వ్యా :- స్త్రీ పురుష చిహ్నాని. తె. గురుతులు. వి. ఆడ మగ గురుతులు.

Sexual : లైఙ్గిక.

S. discharge : semen. శుక్రమ్.

Shaft : కాణ్డమ్, కాణ్డః. తె. కాణ్డము.

Shank : tibia or shin - see bone.

Shape : ఆకారః, ఆకృతిః, సంస్థానమ్. తె. ఆకారము. మూర్తి, రూపము.

Sheath : a covering, an investing substance. (1) ఆవేష్టనమ్, కఞ్చుకమ్, కోశః. వ్యా:- బహిరపి సిరాధమనీ సంవేష్టనమ్, శిథిల ప్రాయం స్నాయుమయమ్, ఏత త్సిరాధమనీనాం సంవరణాయ. తె. ఒఱ, తొడుగు. వి. సిరాధమనుల బయటివైపున మాంసముపొరచే నావరించియుండు తొడుగు.

(2) ఛదః. వ్యా :- పేశీకణ్డరాద్యావరణార్థో నాడ్యాకారః కలాపాశికాద్యంశః. తె. కప్పు, తొడుగు. వి. పేశులకు, కండరములకావరణముగా నాళాకారమునసుండు మాంసపు పొర. ఇది ఒఱగా నుండి కాపాడుచుండును.

Carotid Sh : కారోటచ్ఛదః, మాతృకా కఞ్చుకమ్.

Dental Sh : దన్తావేష్టనమ్.

Femoral Sh : ఊరవ్యాఛ్ఛదః.

నైవర్త్యచ్ఛదః.
Investing Sh : అవసనచ్ఛదః.
Medullary Sh : మజ్జాచ్ఛదః.
Mid cervical Sh : గ్రీవామధ్య కఞ్చుకమ్.
Mucous Sh : శ్లైష్మికచ్ఛదః, స్నైహికచ్ఛదః. తె. అమచ్ఛదము, శ్లేష్మధరణము.
Primitive Sh : ప్రాథమిక తన్త్ర చ్ఛదః.
Sh. of arteries : ధమనీకఞ్చుకమ్.
Sh. of rectus muscle . అజిహ్మచ్ఛదః.
Sh. of veins : సిరాకఞ్చుకమ్.
Skeletogenous Sh : కఙ్కాల జనకచ్ఛదః.
Synovial Sh : కణ్డరాకోశచ్ఛదః. శ్లైష్మికచ్ఛదః, స్నైహికచ్ఛదః.

Sheet : ప్రచ్ఛదా, శయ్యా. తె. పత్రము.

Shin : the anterior edge of the tibia అగ్రజంఘా,జంఘాగ్రభాగః. వ్యా:- జంఘాస్థ్నః పూర్వాగ్రః. తె. పిక్కఎముక ముందుఅంచు.
S. bone : tibia - see bone.

Shoulder : the scapuloclavicular articulation and adjacent parts అంసః, అంసదేశః, అంసపృష్ఠః, అవగోధః, బాహుశిరః, భుజశిరః, స్కన్ధః, స్కన్ధదేశః, (డల్హణః). (2) అంసౌ. వ్యా:- భుజ శిఖరయో రన్ధనౌ. తె. బుజము, భుజశిరస్సు, మూపు, స్కంధము.
S. blade scapula - see bone.
S girdle : the bony girdle composed of the clavicles and scapulas - see girdle.
S. joint : భుజసంధి, కీలు.

Show (1) the menses (2) the sanguinoserous discharge from the vagina in the first stage of labor. లోహితసరః. వ్యా :- శిశుజననాత్ వా ప్రసవాత్ పూర్వం భగమార్గాత్ స్రుతః సరక్త రసః. తె. వి. కానుపుకుముందు స్రవించు ఎరుపునీరు. ఎరుపు ఉమ్మ నీరు. ఇది ప్రసవసూచక స్రావము.

Sialaden : a salivary gland - see gland.

Side : పక్షః, పార్శ్వః, పార్శ్వభాగః. తె. (1) ప్రక్క, పార్శ్వము, (2) డొక్క.

Sight : దర్శనం. దృష్టిః. తె. చూపు, దృష్టి.
Long S: దీర్ఘదృష్టిః. తె. దూరపు చూపు.
Short S : హ్రస్వదృష్టిః. తె. దగ్గర చూపు.

Sigmoid : shaped like the letter S. కుణ్డలికా. వ్యా:- డకార వక్రాకారః. (క) తె. దేవనాగరి

అక్షరములలోని 'డ'కార వక్రము గల పెద్దప్రేవు చివరి భాగము, లేక తలకట్టులేని అచ్చు (s) క.

S. flexure: an S-shaped curve joining the descending colon above to the rectum. డిమ్భః, మలాశయః, వ్యా .- ఆరోహ్యాన్త్రస్య డ (S)కార వక్రాకారో భాగః సతు గుదోపరిభాగేన సన్ధితః. (S) డకార వక్రో డిమ్భః. తె. డింభము.

S. part : వక్రఖణ్డః, వక్రభాగః. తె. వంకరభాగము.

Sign : చిహ్నమ్, లక్ష్మ. తె. గురుతు.

Sinciput : the fore and upper part of the head. లలాటః, శిరోఽగ్రభాగః. తె. నుదురు, లలాటము.

Sinew : a ligament or tendon. స్నసా, సన్ధిబన్ధనమ్, స్నాయుః. తె సంధిబంధనము, స్నాయువు, కండరము.

Sinus : (1) a cavity, hollow, recess, or pocket (2) a dilated channel containing venous blood. (3) A cavity within a bone. (1) కోటరమ్, కోటరాణి. (బ వ). వ్యా :- సూక్ష్మముఖాన్యన్తర్గహ్వరాణి. తె. అరలు, కోటరములు, గదులు. (2) కుల్యా, వ్యా :- ఆయతసిరామార్గః, సిరాకుల్యా, సిరాసరిత్. తె. చెడు - అపరిశుద్ధ - రక్తనాళము. (3) పరిఖా, సరణిః (సరణ్యః. బ. వ). వ్యా :- కరోట్యన్తర్గత దృఢకలాపటద్వయాన్తరాళస్థితా స్సవిశేషాస్సిరా ఏవ. the sinuses of the brain. తె. వి. మెదడులోని కోటరములు, సిరలు. (4) గతిః, నాడీ, నాళీసురంగః. తె. తొఱ్ఱ, సొరంగము, నాళము, సెల.

Air Si : cavity within bones containing air : ఈరణకోటరమ్. తె. ఎముకలలో గాలియుండు అరలు లేక తొఱ్ఱలు.

Antero inferior Si : పురస్తనాధరాసరణిః.

Aortic Si : ధమనీకోటరమ్, ధామనకోటరమ్.

Basilar Si : (1) మూలికాసరణిః, మౌలికీసరణిః. (2) మస్తిష్కమూలికా కుల్యా (చక్రమ్).

Carotid Si : మాతృకా నాళీ, మాతృకాసరణిః.

Cavernous Si: (1) త్రికోణికే(గ) (గ) సుషిరసరణిః, సౌషిరీసరణిః. (2) క. శృఙ్గాటకాని (సు శా. 6. 28). వ్యా :- ఘ్రాణశ్రోత్రాక్షిజిహ్వా సంతర్పణీనాం మధ్యే సిరాసన్నిపాతః, శృంఘాటకాని (ద్విగుణః) గ. శృంఘాటకః వ్యా:- నాసాకర్ణ స్రోతోఽక్షి జిహ్వాతర్పణీనాం

సిరాణాం సన్నిపాతః శృంగాటకః (సు. చి. 40-30 వ్యా :- డల్హణః) తె. శృఙ్గాటకము. వి. ముక్కు, చెవి, కన్ను, నాలుకలను తృప్తిపరచు నాళముల సమూహము, కూడలి.

Cervical Si : గ్రైవనిమ్నికా పరిఖా.

Circular Si : ఆవృత్తకోటరమ్. వ్యా :- పోషణికా గ్రన్థ్యావృతసిరా పరిఖా.

Confluence of Si : మహా సిరావర్తః, సిరాసన్నిపాతః, తె. సిరల కూడలి.

Coronary Si : మణ్డల పరిఖా, హార్దికీ మూలసిరాకుల్యా, బృహత్సిరా సరణిః.

Cranial Si : శిరః కపాలాన్తర సిరాకుల్యా, సిరాసరిత్.

Frontal Si : లలాటకోటరమ్.

Frontal air Si : లలాట గ్రైరణ కోటరమ్.

Inferior longitudinal Si : అధరాతానికసరణిః.

Inferior petrosal Si : అధరప్రాస్తర సరణిః, అశ్మతటినీ.

Inferior sagittal Si : అధర సాయక సరణిః, దీర్ఘికా అధరా సిరాకుల్యా. సిరాసరిత్.

Inter covernous Si : త్రికోణికా యోజన్యా, సుషిరాన్తర సరణి.

Laryngeal Si : స్వరయన్త్రఖాతః.

Lateral Si : పార్శ్వకౌపరిఖా.

Left frontal Si : వామలలాట కోటరమ్

Longitudinal Si : దీర్ఘికా సిరా పరిఖా.

Lymph Si : రసకోటరమ్, రసకుల్యా, రసాశయః.

Marginal Si : ప్రాన్త-ప్రాన్త్య-ప్రాన్తీయ, పరిఖా.

Mastoid Si : హనుకోటరమ్.

Maxillary Si : హనుకోటరమ్.

Middle meningeal Si : మధ్యపారిగోర్ధ సరణిః, మధ్యమపారిమస్తిష్కా-మస్తిష్క-సరణిః.

Nervous Si. తన్త్రీయసరణిః, ప్రధానసరణిః.

Occipital Si : పశ్చిమ కపాలికా (సిరాకుల్యా), పార్ష్ణికీసరణిః, పృష్ఠకీయసరణిః.

Petrosal Si : అశ్మతటిన్యా, అశ్మసిరా పరిఖా.

Placental Si : అపరాయవసరణిః, జరాయవకుల్యా.

Postero superior Si : పశ్చిమోత్తరసరణిః

Rectus Si - see straight Si.

Renal Si : వృక్కకోటరమ్.

Sagittal Si : సాయక సరణిః.

Si. tarsi : కూర్చసురఙ్గః, గుల్ఫపార్ష్ణ్యన్తరసురఙ్గః.

Si. tonsillaris : ఔపజిహ్వక నిమ్నికా, ఔపజిహ్వకసరిత్కా.

Si. venosus : వాహినీయ పరిఖా, సిరాపరిఖా.

Sphenoidal air Si : స్ఫైనకేరణ కోటరమ్.

Sphenoparietal Si : స్ఫీ (స్ఫై) న పార్శ్వకీయ సరణిః.

Straight Si : ఋజుసరణిః, దీర్ఘికాయోజనీ సిరాకుల్యా, సరలసిరా పరిఖా.

Superior longitudinal Si : ఉత్తరసాయకసరణిః, ఉత్తరాతానిక సరణిః.

Superior petrosal Si : ఉత్తర ప్రాస్తరసరణిః, అశ్మతటినీ.

Superior sagittal Si : ఉత్తర సాయకసరణిః, దీర్ఘికా ఉత్తరా. సిరాసరిత్.

Terminal Si : పార్యన్తసిరా కుల్యా. వ్యా :- బలిష్ఠధర్మా నాళ్యా వేష్టితా సిరాసరిత్.

Transverse Si : అనుపార్శ్వకే (ద్వే), తిరశ్చీన - తిర్యక్ - సరిణీ (సరణిః).

Urogenital Si : వస్త్యుపస్థీయ పరిఖా.

Venosus Si : (1) సిరాకుల్యా, సిరాసరిత్, సిరాసరణిః. (2) అశుద్ధ రక్తప్రవాహినీ. వ్యా:- విషమపరిణాహ రక్తనాళీ, వాహినీయగతిః వా పరిఖా.

Sinusoid పరిఖాయితమ్.

S. of liver : bile capillary : పిత్తాయనీ.

Skein : స్కైన్ఘః, పఞ్జికా, కౌశికసూత్రగ్రన్థిః.

Skeletal : pertaining to the skeleton · కఙ్కాల, కఙ్కాల సమ్బన్ధ.

S. muscle : one attached to the skeleton - see muscle.

S. tissue : the tissue of the framework of the body - see tissue.

Skeletogenous : producing the skeleton : కఙ్కాలోత్పాదకః.

S. layer - see layer.

S. sheath - see sheath.

Skeleton : the bony framework of the body, supporting and protecting the soft tissues and organs. అస్థిపఞ్జరః, కఙ్కాలః, కఙ్కాలధామ, కుల్యధామ, పఞ్జరః. తె. అస్థిపంజరము, ఎముకలగూడు, కంకాళము, పంజరము. వి. శరీరము యొక్క ఎముకలగూడు.

Appendicular Sk : ఉప కఙ్కాలః, గౌణకఙ్కాలః.

Axial Sk : అక్షకఙ్కాలః, ముఖ్య కఙ్కాలః.

Cranial Sk : శిరః కఙ్కాలః.

Human Sk : అస్థిసంగ్రహః, మానవ కఙ్కాలః.

Splanchno Sk: కోష్ఠాఙ్కపఞ్జరః.

Skin : the tissue which forms the outer covering of the body. కఞ్చులికా, చర్మ, త్వక్, శరీరావరణమ్. వ్యా :- సర్వదేహబహిర్భాగావరణార్థా శ్చర్మ విశేషః తె. చర్మము, తాట, తోలు. వి. శరీరము బయట నావరణముగా కప్పుగా నుండు ఏడుపొరలు గల చర్మము.

Fore S : మణిచ్ఛదమ్, మేఢ్రచర్మ, శిశ్నాగ్రచర్మ. తె. తొప్పె వి. చుల్లికొయ్య బొగడను కప్పియుండు తోలు, ముందోలు.

Scale of the S - see scale.

Scarf of the S - see epidermis.

True S - see cutis, dermis.

Skull : bony case of the brain, bony frame work of the head, cranium. కపాలః, కరోటిః, శిరఃకఙ్కాలః, శిరోఽస్థిపఞ్జరః. వ్యా :- సకలశిరోఽస్థ్నాం సఙ్ఘాతః. తె. కపాలము, కరోటి, పునుక, పుఱియ, పుఱ్ఱె, బుఱ్ఱ, బుఱ్ఱకాయ, శిరము. వి. తల ఎముకల గూడు, తల ఎముకల సంపుటము (సంపుటి), తల.

Anterior region of the S - see region.

Base of the S - see base.

Roof of the S - see roof.

Side of the S : కరోటిపక్షః, కరోటి పార్శ్వః.

S. bones : flat bones of the skull - see bone.

S. cap : cranium.

Upper surface of the S - see surface.

Vault of the S : శిరః కఙ్కాల వలభిః, శిరోవలభిః. వ్యా :- శిరస ఉపరితనభాగః, మస్తకమ్, మూర్ధా, శిరః. తె. నడినెత్తి.

Slit : అర్ధరన్ధ్రమ్, ఛిదా, ఛిద్రమ్, దీర్ఘ ఛిద్రమ్, దీర్ఘ ఛేదనమ్. వ్యా :- విష మాకృతీ న్యపూర్ణపరిధీని రన్ధ్రాణి (బ. వ.) తె. చీలిక, ఛిద్రము, నిలువు కోత, పగులు.

Smegma : the sebaceous secretion which accumulates beneath the prepuce and clitoris. మేఢ్రమలమ్, ప్రజననమలమ్, శిశ్నమలమ్. తె. పాసు. వి. బొగడపైన ముందోలు క్రింద పుట్టును. ఇది మేదస్సువలన జనించు మలము. స్త్రీలకు భగమణిక్రింద యీ మలము పేరుచుండును.

Smell : గన్ధః, తె. వాసన.

Socket : hollow into which a movable part is inserted or fixed. ఉదూఖలః, గర్తః. తె గుంట,

గొయ్యి, పల్లము. వి. ఎముకలలోని రోలువంటి గుంట.

Eye S: నేత్రగర్తః. తె. కనుగుంట.

S. of the teeth - see teeth.

Sodium : శోధ్యమ్, స్వాద్యమ్, లవణమ్. తె. ఉప్పు, రుచి.

S. corbonate : స్వాద్యకార్బణితమ్.

S. chloride : సాముద్రలవణమ్. తె. ఉప్పు, సముద్రలవణము.

S. phosphate : స్వాద్యభాస్వరితమ్.

Solar : సూర్యసమ్బన్ధి, సౌర. తె. సూర్యసంబంధమైన.

S. plexus : a plexus of gauglia and nerves for the abdominal viscera, the complex of nerves at pit of stomach - see plexus.

Sympathetic part of S : see plexus.

Sole: the planter surface of the foot, the bottom of the foot. తలమ్, పాదతలమ్, పాదమధ్యః, పాదహృదయమ్. తె. అడుగు, అఱకాలు, పాదము, పాదహృదయము.

Solid : ఘనమ్, నిబిడమ్, సుసంహతః. వ్యా:- అన్తస్సుషిరహీనమ్. తె. గట్టి, దిట్టము, నిబిడము. వి. బెజ్జములేని.

S. cord : దృఢసూత్రకమ్, నిబిడసూత్రకమ్.

S, lamina - see lamina.

S. portion - see portion.

Soma : the body. దేహః, శరీరమ్. తె. ఒడలు, కాయము, దేహము, మేను, మై, శరీరము.

Somatic : of the body. దైహిక శారీర, శారీరక. తె. శరీర సంబంధమైన.

S. cell - see cell.

S. mesoderm : దైహికమధ్యధర్మ. mesoblast.

Somatology - the study of (human) anatomy and physiology. శారీర రచనా క్రియాజ్ఞానమ్.

Somato plasm : the protoplasm of the body - cells. శరీరసూక్ష్మకోశ జీవభూమిః, దేహాశకలప్రోఫబలాసికా.

Somatoplure : the upper layer of mesoblast. దేహప్రాచీరః, మధ్య బలిస్థ ప్రాచీరః.

Somatotomy : the anatomy of the human body. మానవదేహనిర్మాణమ్, మనుష్య శరీర రచనా, మానవ శరీర వ్యవచ్ఛేదవిద్యా.

Soul : the incorporeal or immaterial part of man, the vital or intellectual principle. ఆత్మా, చిత్, చేతః, చైతన్యమ్. తె.

ఆత్మ, చైతన్యము, మనసు, సత్త్వము.

Sound : ధ్వనిః, శబ్దః, స్వనః తె. చప్పుడు, ధ్వని.

Space : a region or partially enclosed part of the body. అన్తరాలః, అవకాశః, ప్రదేశః, స్థలమ్. తె. చోటు, ప్రదేశము, బయలు, విడిచోటు. వి. శరీరములోని యవకాశము.

Axillary Sp : కక్ష్యదేశః. తె. చంక.

Epidural Sp : పరివరాశికా.

Inter cellular Sp : కోశికాన్తర అవకాశః, శరీరధాత్వవకాశః. తె. వి. శరీర ధాతువు మధ్యనుండు ప్రదేశము - విడిచోటు.

Inter mammary Sp : స్తనాన్తరమ్. తె. వి. రెండు స్తనములకు మధ్యగల ఎడము, చోటు.

Intermediate Sp., inter Sp : అన్తరాళః. తె. అన్తరాళము. వి. లోప్రదేశము.

Interstitial Sp - see inter cellular Sp.

Inter tissue Sp - see inter cellular Sp.

Inter villous Sp : అన్తరాఙ్కురావకాశః, కలికాన్తరావకాశః, కలికాన్తరాళః.

Inter visceral Sp : శరీరధాత్వవకాశః. తె. వి. శరీర ధాతువుల మధ్యనుండు విడిస్థలము, రిక్తప్రదేశము.

Lymph Sp . connective tissue space containing lymph. లసీకాన్తరాళః. వ్యా :- సంయోజకధాత్వన్తఃస్థలసీకాప్రదేశః.

Marrow Sps : మజ్జావహస్రోతాంసి. తె. వి. మూలుగయుండు నాళములు, ప్రదేశములు.

Medullary Sp : మజ్జావకాశః.

Sp. between gall bladder and rectum . పిత్తపక్వాశయాన్తరమ్ తె. వి. పిత్తపక్వాశయములకు మధ్యనున్న ప్రదేశము.

Sub arachnoid Sp : బ్రహ్మోదకుల్యా వా అవకాశః.

Subdural Sp : అన్తర్వరాశికా.

Spade : అఖః, ఖనిత్రమ్. వ్యా :- ఖనిత్రాకార అవయవవిశేషః. తె. పాఱ. వి. పాఱవలెనుండు అంగవిశేషము.

Special senses : అక్షపఞ్చకమ్, జ్ఞానేన్ద్రియాణి, బుద్ధీన్ద్రియాణి. తె. తెలివిడులు, తెలుపుడులు. వి. శబ్దాది బాహ్య విషయములను గ్రహించు- తెలిసికొను - అయిదు (ఐదు) జ్ఞానేంద్రియములు.

Specific gravity : జాతిగురుత్వమ్, సాన్ద్రిమకాష్ఠా. తె. తారతమ్యగరిమ, తారతమ్య సాన్ద్రిక.

Specimen : నిదర్శనమ్, ప్రతిరూపమ్. తె. మచ్చు, మాదిరి.

Sperm . semen, seed. గర్భబీజమ్,

పుంబీజమ్, రేతః, వాజీ, వీర్యమ్, శుక్రమ్, శుక్రకీటమ్. తె. ఇంద్రియము, వీర్యము, శుక్రము, శుక్రాణువు, శుక్లము.

Spermatic: pertaining to sperm. పౌరుషీయ, శౌక్ల. వ్యా :- శుక్రసమ్బన్ధి. తె. శుక్రమునకు చెందిన.

S. artery : a branch of the abdominal aorta. రేతోధమనీ, శౌక్లధమనీ. వ్యా :- ఔదర్యధమనీ శాఖా. తె. శుక్రవహాధమనీ.

S. cord : ఫలస్రోతసీ, ముష్కస్రోతః ముష్కాధారక రజ్జుః, వీర్య వాహినీ, వృషణ బన్ధినీ, వృషణ సూత్రకమ్. తె. పురుష శుక్రనాళము(లు), వీర్య వాహిని(నులు). వి. ఇవి వట్టలతో ముడివడియుండును. పా ల చే ర నరము.

S. plexus - see plexus.

Spermatid : పౌరుషకః, పౌరుషార్భకః, శుక్రోత్పాదక శకలమ్, శౌక్ల శకలమ్.

Spermatocele : a spermatic cyst of the testicle. శుక్రపుటికా, శుక్రస్థానమ్, శుక్రాశయః, శౌక్ల కోశః. వ్యా:- ఫలాన్తర్గత సూక్ష్మకోశః, యత్ర శుక్రం వసతి. తె. శుక్రాశయము.

Spermatocyst : seminal vesicie. సూక్ష్మవీర్య - శుక్ర - కోశః. తె. వీర్యకోశము.

Spermatocyte : germinal cell of a spermatozoon - see cyte.

Spermatogenisis, spermatogeny: the formation and development of sperms. పరమేష్ఠిజననమ్, శుక్రోత్పత్తిః, శుక్రోత్పాదనమ్. తె. శుక్రోత్పత్తి, శుక్రజన్మ. వి. శుక్రము పుట్టి పెరుగుట.

Spermatogenium . a formative seminal cell. పరమేష్ఠి జనక శలకమ్, శుక్రోత్పాదక శలకమ్.

Spermatozoon : a mature male reproductive cell, an active, fecundating seminal element. పరమేష్ఠిః. పుంబీజమ్, పుంబీజాణుః, పౌరుషం, పౌరుషః, బీజాణుః, వాజీ, శుక్రమ్, శుక్లమ్. వ్యా:- తస్యేదం రూపమ్. యథా:- జాతమాత్ర జలమణ్డూక పృథుకాకారో, దీర్ఘకృశాకృతిః, స్థూలావృత్త శిరాశ్శిరోగ్రీవామధ్యగాత్రపుచ్ఛ,పుచ్ఛాగ్రరూపాజ్ఞకఞ్చుక సహిత శ్చలస్వభావః, తస్యేమానినామాన్యపి భవన్తి. పురోనవక్రియమ్, పురుషబీజమ్, శుక్రగతపుంబీజమ్, శుక్రబీజమ్, శుక్రబీజాణుః, వీర్యపరమాణుః, శుక్రజీవాణుః, శుక్రాణుః, శుక్లబీజమ్. వ్యా:- అస్య స్వభావః, కర్మచ. అశుగర్భాధానకారి శుక్రబీజమ్. (శుక్రతన్మాత్రా). తె. పురుష బీజము. ఆకారము:- అప్పుడే పుట్టిన నీటికప్పపిల్లవలె నుండును.

ఆకృతి వర్ణనము :- సన్ననిపొడవును, గుండ్రని లావుతలయు, సన్నని మెడయు తోకయుగల శరీరముతో నుండు కప్పపిల్లవలె నుండును. పని:- గర్భోత్పత్తి - కడుపుచేయు చురుకైన శుక్రబీజము.

Sphenoid : cuneiform, wedge-shaped. (1) కీలాకృతిః, శఙ్కుః. తె. ఉలిఆకారములోనున్న అవయవ భాగము. (2) గోళః, గోళాకృతిః (3) స్ఫినకీయ ప్రరోహః.

S. bone : the wedge-shaped bone at the anterior base of the skull articulating with the occipital bone at the back, the ethmoid in front and the parietals and temporal bones at the sides. శిరోఽస్థి భేదః. తె. వి. తల ఎముకలు ఆరింటిలో నొక ఎముక.

Fronto Sph : లలాట స్ఫినకీయ ప్రరోహః.

Infra orbital Sph : కుణ్డాధర ప్రరోహః.

Orbital Sph : కాణ్డః ప్రరోహః.

Post Sph : పశ్చాత్ స్ఫినకీయ.

Sinous process of Sph - see process.

Temporal Sph : శఙ్ఖ, శాఙ్ఖ ప్రరోహః.

Sphenoidalis lumbus : దార్వ్య నకూలమ్.

Sphenoidate jugum : స్ఫినకీయ యుగ్మమ్.

Sphere . గోళః. తె. గోళము.

Attractive S : ఆకర్షణగోళః.

Post nasal S : నాసాపశ్చిమ గోళః, నాసా పశ్చిమ దేశః. తె. ముక్కులో వెనుకభాగము.

Spherocyte : round red blood cell. గోళకోశః. గోళాణుః. వ్యా:- వృత్తరక్తకణికా వా కణః. తె. గుండ్రని నెత్తురుపలుకు, రక్తకణము.

Sphincter : a ring like muscle which closes a natural orifice, a muscle constricting ,orifice. ముద్రా, సంవరణీ కణ్డరా, సంవరణీ, ముద్రణీ. వ్యా:- సుషిరస్నాయుః. తె. ముద్ర, సుడీ, వి. ఆయా ఆశయ ద్వారముల లోపలి వైపున ఉంగరములవలెనుండు మాంస కండరము (పేశీ). ఇది సన్నని మాంసపు దారములతో నిర్మింపబడి తలుపువలెనుండు ముద్ర.

Pyloric S: అన్నధరాకలా. వ్యా:- ఆకృతిః - వలయాకార ముద్రా కపాటికా, సుషిరపేశీ ముద్రికా.

S. ani - see anus.

S. externus : సంవరణీగుదవళిః. తె. వి. ఆసనములోని "సంవరణీ" యను రెండవ సుడీ-ముద్ర.

S. in anus : గుదవళిః. తె. ఆసన

మునగల ముద్ర లేక సుడి.

S. internus : విసర్జని గుదవలిః. తె. వి. మలమును బయటికి నెట్టివేయు-వెడలించు-"విసర్జని" యను మూడవ సుడి.

S. of the bladder : వస్తి ముఖముద్రణీ. తె. వి. ఉచ్చతిత్తి బెజ్జమువద్దనుండు కవాటము, ముద్ర.

S. pupillae : దృష్టిమణ్డలికా.

S. urethra : మూత్రధరా.

Spina : spine.

Spinal : pertaining to the spine. వంశ్యః, పృష్ఠవంశ సమ్బద్ధీ. తె. వెన్నును చెందిన, వెన్నుబామును సంబంధించిన.

S. bulb : the medulla oblongata.

S. canal - see canal.

S. column : the back bone - see bone.

S. cord : the nerve tissue in the spinal canal - see cord.

S. ganglion - see ganglion.

S. marrow - see the spinalcord.

S. nerve - the 31 pairs of nerves of the spinal cord - see nerve.

Spinalis - see muscle.

Spindle. (1) తర్కుః వ్యా :- స్థూలమధ్యావేమ సమాకారాః పేశ్యః, (బ. వ.) (2) వేమా. వ్యా :- తన్తువాయానాం సూత్రగతాగత కారకో యన్త్ర విశేషః. తె. కదురు. వి. నూలు పట్టెడు సాలెవానికదురు యాకారము గల మాంసపేశీలు. (3) దారపుకండె వంటి మాంసపేశీలు

Achromatic S : అక్రమాధీన తర్కుః. తె. వి. కదురువంటి పాలిపోయిన మాంసపేశి.

Nuclear S : కేన్ద్రిక తర్కుః, నవక్రియతర్కుః.

Neuro - muscular S : తాన్త్ర పేశీయతర్కుః.

Neuro tendinous S : తాన్త్ర కాణ్డాస్తర తర్కుః.

Nissel's Ss : తన్త్రతర్కుకాః (బాఢం రఞ్జనీయాః).

Spine : 1. vertebral column. 2. a shorp or thorn-like process of bone. (1) పృష్ఠవంశః, పృష్ఠిః, పృష్ఠేషికా, రీఢకః, వంశః. తె. కశేరు, కశేరుక, మేరుదండము, వెన్ను, వెన్నుబాము, వెన్నెముక. (2) కణ్టకమ్. వ్యా:- అస్థ్నాం కణ్టక మివ ప్రరోహః. తె. (1) కంటకము, ముల్లు, శృంగకము. వి. ఎముకలకుండు ముళ్ళవంటి చిన్న బుడిపెలు లేక మొనలు (బ. వ.) (2) మణిస్తంభము, కొంకులు.

Anterior inferior iliac Spi : జఘనాధరపురః కూటః, శ్రోణి కపాలపురోఽధఃకణ్టకమ్.

Anterior nasal Spi : పురస్తన నాసాకణ్టకమ్.
Anterior superior Spi · పూర్వోత్తర శృంగః, శృంగకః.
Anterior superior iliac Spi : జఘనోత్తరపురఃకూటః.
Cervical Spi : గ్రీవా వంశో.
Erector Spi : పృష్ఠవంశధరా.
Ethmoidal Spi : త్రికోణకణ్టకమ్, సీవకీయకణ్టకమ్.
Frontal Spi : లలాటకణ్టకమ్.
Iliac Spi : శ్రోణికణ్టకమ్, శ్రోణకణ్టకమ్.
Ischial Spi : కుకున్దర కణ్టకమ్. నితమ్బ (త్రిక) కుకున్దరాస్థి కణ్టకమ్.
Mental Spi : చిబుక కణ్టకమ్.
Nasal Spi : అగ్రకణ్టకమ్, నాసాకణ్టకమ్.
Posterior inferior iliac Spi : జఘనాధర పశ్చిమకూటః.
Posterior superior iliac Spi : జఘనోత్తర పశ్చిమకూటః.
Postnasal Spi : పశ్చిమ నాసాకణ్టకమ్.
Pubic Spi : భగాస్థికణ్టకమ్.
Sphenoethmoid Spi : స్ఫినకాస్థి (స్థూః) సీవకీయ కణ్టకమ్.
Spi (spina) angularis . కోణకణ్టకమ్.
Spi. of ischium : కుకున్దర కణ్టకమ్. వ్యా :- త్రికోణప్రాయం ప్రవర్ధనకమ్.
Spi. of palate : కాకలకణ్టకమ్, తాలుపృష్ఠకణ్టకమ్.
Spi. of scapula : అంసప్రాచీరకమ్, అంసార్గళమ్ - see scapula.
Tibial Spi : స్థావిర కణ్టకమ్.
vertebral Spi : పృష్ఠకణ్టకమ్.

Spirit : 1. అసుః, ఆత్మా, ప్రాణః. 2. ఉత్సాహః, ధైర్యమ్. తె. 1. ఉసురు, ఊపిరి, ప్రాణము. 2. ఆత్మ. 3. ఉత్సాహము, చులుకు, ధైర్యము.

Splanchnic : pertaining to viscera. ఆశయిక, కోష్ఠాఙ్గ, కోష్ఠాఙ్గక, కోష్ఠాఙ్గీయ. వ్యా.- కోష్ఠాఙ్గసమ్బన్ధః. తె. కోష్ఠాంగములకు చెందిన. వి. కోష్ఠమునగల ఆశయాది వివిధావయవములకు సంబంధించిన.
S. efferent nerve - see nerve.

Splanchology : science of the structure and functions of the viscera. (1) కోష్ఠాఙ్గవిజ్ఞానమ్, కోష్ఠాఙ్గరచనా క్రియావిజ్ఞానం వా శాస్త్రమ్. తె.కోష్ఠాఙ్గనిర్మాణ క్రియా విజ్ఞానము - విద్య. (2) ఆన్తరాఙ్గ విజ్ఞానమ్, ఆన్తరాఙ్గస్కన్ధః, ఆశయ ప్రకరణమ్. వ్యా:- ఆన్తరాఙ్గ స్వభావ - రచనా-క్రియా విజ్ఞానమ్, ప్రత్యఙ్గ విజ్ఞానమ్.

Splanchnopleure : the wall of

the alimentary tract of a vertebrate. అన్త్రప్రాచీరమ్, కోష్ఠాజకమధ్య ధర్మా, ప్రాథమిక పచన నాడీ ప్రాచీరమ్. తె. ఆమాశయ పార, స్తరము.

Spleen : An oval viscus or lymphoid, vascular organ immediately below the diaphragm, at the tail of the pancreas, behind the outer end of the stomach. ప్లీహా. వ్యా :- స్థానమ్ :- హృదయస్యాధో వామతః ప్లీహా (సు. శా. 4-31) వామ పార్శ్వస్థితః కోష్ఠే. (సు. శా. 4-25 వ్యా .- డల్హణః). ఉదరపార్శ్వ స్థితః (సు.ని. 9-18) వామపార్శ్వాశ్రయం మాంసఖణ్డమ్ (సు.సూ. 21-7 వ్యా- డల్హణః), ఉదరస్యవామపార్శ్వే స్థితః (మా. ని. 40-12½ శ్లో. ఆతంకదర్పణ వ్యాఖ్యానే) పిత్తస్థానమ్, రఞ్జక పిత్త ప్రభవస్థానమ్. తె. తెల్లదబ్బ. ప్లీహము. వి. ఉనికి:- ఇది కోష్ఠమున (కడుపులో) ఎడమవైపున గ్రుడ్డాకారమున నుండు అవయవము. నెత్తురు పుట్టుచోటు. రసమున కెఱ్ఱదనము గలిగించు రంజకపిత్తము ఇచ్చట నుండును.

Hilum of S - see hilum.

Splenetic, splenic: belonging to the spleen. ప్లైహిక. వ్యా :- ప్లీహాసమ్బన్ధీ.

S. artery - see artery.

S. vein - see vein.

Splenology : the science of the spleen. ప్లీహావిజ్ఞానమ్, ప్లీహరచనా క్రియావిజ్ఞానమ్. తె. ప్లీహావిజ్ఞాన శాస్త్రము.

Spondyle : a vertebra.

Sponge: పిఞ్జికా, స్పఞ్జికా, తె. సముద్రపుపాచి, స్పాంజి.

Spongioplasm - see plasm.

Spore : germ, seed, a reproductive element, any spermatic or ovulary cell. బీజమ్, బీజాణుః, పునరుత్పాదక మూలతత్త్వం వా ద్రవ్యమ్. శుక్రాణు వా స్త్రీబీజాణుః. తె బీజము, శుక్రాణువు, స్త్రీబీజము, వి. ప్రజోత్పాదక మూలవస్తువు.

Spot. బిన్దుః, లాఞ్ఛనమ్. తె. గుర్తు చుక్క, మచ్చ.

Black S : శ్యామబిన్దుః, తె. నల్ల మచ్చ.

Germinal S : బ్రహ్మబిన్దుః, లఘు కోశః nucleolus.

Squama. scalelike plate of bone or lamina. శాకలఖణ్డః. తె. పొలుసు, శకలము.

Squamosa - see squamous bone.

Squamous : scaly. శకలీ, శల్కలీ. తె. పొలుసుకు చెందిన, శకలమునకు సంబంధించిన.

S. bone - see Bone.

Stage : a period. అవస్థా.

Aster St : తారకావస్థా.

Dister St : ద్వితారకావస్థా.

Monster St : ఏకతారకావస్థా.

Stalk : కాణ్డః, వృన్తః, నాళః. తె. కాడ, తొడిమ.

Body St : దేహవృన్తః. వ్యా:- కోఽపిమధ్యధర్మాబన్ధకః, ప్రథమం భ్రూణస్యపుచ్ఛభాగం పరాయ్వా సహాయోజయతి. తె. దేహవృన్తము, మేనుతొడిమ, మధ్యధర్మ (కట్టు), బంధకము.

Cerebral St : గోర్దవృన్తః.

Optic St : అక్షివృన్తః.

Stamina: inherent force, vigor. అన్తర్బలమ్, ఓజః, తేజః, ప్రాణః. తె. ఓజస్సు, తేజస్సు, ప్రాణము, బలము, సర్వధాతుసారము.

Starch : స్థారకః, మణ్డః. తె. గంజి. వి. గంజివంటిశరీర వస్తువిశేషము.

Stellate : star - shaped. తారకాకారః, నక్షత్రాకారః. వ్యా:- నక్షత్రాకారశరీరద్రవ్య విశేషః. తె. నక్షత్రాకారముగల దేహవస్తు విశేషము.

S. cells - see cell, nerve eells in the molecular layer of the cortex cerebri.

S. ligament - see ligament.

Stem : కాణ్డః, వృన్తః.

Cartilaginous S : కీకసవృన్తః.

Venous S : సిరాకాణ్డః.

Stercus : dung, excrement. మలమ్. తె. పియ్యి, పెంట, మలము.

Sterile : barren, not fertile. అనుర్వర, వన్ధ్యా. తె. గొడ్డుబోతు, వంధ్య. వి. ఫలించని.

Sterility . అనపత్యతా. వన్ధ్యత్వమ్. తె. గొడ్డుతనము, గొడ్రాలుతనము, వంధ్యాత్వము. వి. పిల్లలు పుట్టకపోవుట, హూచకమ్మ.

Sternal : pertaining to sternum. ఉరఃఫలకీయ, ఉరోఽస్థీయ, ఔరస.

S. end : ఔరసాగ్రమ్. వ్యా:- అగ్రకోణః.

S. plate - see sternum.

Supra S. notch - see notch.

Sternum : the flat bone of the breast. ఉరఃఫలకమ్, ఉరోఽస్థి. తె. ఉరఃఫలకము. రొమ్ముఎముక - see bone. A narrow, flat bone shaped like a dagger with a handle, blade and tip.

Epi S - see manubrium.

Meso S - see gladiolus.

Meta S : the xiphoid cartilage.

The lowest bone of the : అధోరఃఫలకాస్థి, ఉరోఽధః, ఫలకాస్థి - see xiphoid bone.

**Stoma**: the mouth. ఆస్యమ్. తె. నోరు.

**Stomach**: the chief digestive organ, the most dilated part of the digestive tube, situated between the oesofagus (cardiac orifice) and the beginning of the small intestine (pyloric orifice). It lies in the epigastric, umbilical and left hypochondriac regions of the abdomen. The wall is composed of four coats:- serous, muscular. submucous and mucous, (1) అగ్నిస్థానమ్. (సు. ఉ. 39_18 శ్లోక వ్యాఖ్యానే.) (2) అన్న పానాశ్రయః, అన్న సమ్పుటః. అన్నాశయః, ఆమాశయః, జఠరమ్, ప్రథమజీర్ణాజమ్, ముఖ్యజీర్ణాజమ్, పక్తిస్థానమ్. (సు. ఉ. 39_18 శ్లో. వ్యా.) తె. అన్నకోశము, ఆమాశయము, కడుపు, జఠరము, జీర్ణాశయము, పొట్ట. వి. తినినయన్నము, త్రాగిన నీరు అరుగుటకు నిలవయుండుబోలు అవయవము లేక తావు. (3) శ్లేష్మస్థానమ్ శ్లేష్మాశయః. తె. కఫస్థానము. శ్లేష్మాశయము. ఆకారము:- ఇది జిల్లేడు కాయనుబోలి కండరములచే నిర్మితమై సంచివలెనుండును. దీని చివర నుండి చిన్నప్రేవు మొదలగును.

Cardiac end of the S: ఆమాశయద్వారమ్. Cardiac orifice, స్తనయోర్మధ్య మధిష్ఠాయోరస్యామాశయద్వారమ్. (సు.శా.6_25 గద్య)

**Stomodeum**: primitive oral cavity of the embryo. ఆద్యముఖమ్, ప్రాథమిక వక్త్రమ్. వ్యా:- భ్రూణ స్యాద్యముఖగహ్వరమ్. తె. గర్భములోని పిండము నోరు. ఇది తొలిగా యేర్పడు అవయవములలో నొకటి.

**Stool**: an evacuation of the bowels. పురీషమ్, మలమ్. తె. పియ్యి, పెంట.

**Strand**: a little cord. దృఢసూత్రకమ్, నిబిడసూత్రకమ్, రజ్జుకః, సూత్రకమ్. తె. గట్టి త్రాడు, సూత్రము.

Fibrous Str: తాన్తవరజ్జుకః.

**Stratified**: ఆస్తృతః, సస్తరా. తె. పొరగా చేయబడిన.

Non S: నిస్తరా. తె. పొరగా చేయబడని.

**Stratiform**: formed into a layer. ఆస్తరణమ్, ఆస్తరణకృతమ్, ఆస్తరణార్ధకమ్, ఆస్తరణరూపమ్. తె. పొరగా చేసిన, పొరగా మార్చబడిన.

**Stratum**: a layer or lamina. ఆస్తరః, ఆస్తరణమ్, పటలమ్, స్తరః. తె. తెఱ, పొర.

Nervous S : తాన్త్రిక పటలమ్, తాన్త్రిక స్తరః. వ్యా:- ఆస్తర తాన్త్రికమ్.

S. compactum : ఘనస్తరః తె. దట్టమైన పొఱ.

S. corneum : the outer layer of epidermis. (1) అవభాసినీ, ఉదకధరా. (2) కఠర స్తరః. వ్యా:- బాహ్యతమపటలమ్.

S. fibrosum : తాన్తవ స్తరః.

S. germinativum : చరమ స్తరః, బీజస్తరః. వ్యా:- శ్వేతా, నిబిడ ప్రేరణ రూపా భవతి.

S. granulosum : సికతా స్తరః. (శ్వేతా). తె. కణము పొఱ.

S. lucidum : (2) విమల స్తరః. వ్యా:- అస్పృగ్ధరా. లోహితా.

S. malpighii : S. mucosum శ్లైష్మిక స్తరః.

S. opticum : అక్షి స్తరః, దార్శన పటలమ్, దార్శన స్తరః.

S. spinosum : the rete-mucosum, innermost layer of epidermis. ఆన్తరతమ స్తరః.

S. spongiosum : విరల స్తరః.

Synovial S : స్నేహ స్తరః, స్నైహిక స్తరః, వ్యా:- ఆన్తర స్తరః, ఏష స్నేహాఖ్యం ద్రవం రక్షతి.

Streak : a line or color mark. రాజిః, రేఖా, వర్ణరేఖా. తె. గీత, చార, రంగుగీత.

Medullary S : see groove.

Primitive S : ప్రారమ్భరేఖా.

Stria : a streak or line. రాజిః, వ్యా:- వివిధవర్ణరేఖా. యథా:- సరాజిపేశ్యాదిషు. తె. గీత, చార, వి. సూక్ష్మరేఖ. ఇది మాంస పేశీలలో పలువన్నెలుగా నుండును.

Cutaneous S : త్వగ్రాజిః.

Striae gravidrum : the atrophic lines upon the abdomen of pregnant women : కిక్కసః. తె. గర్భిణీస్త్రీకడుపుపై తేలియుండు చారలు లేక నరములు.

Stroma : the foundation tissue of an organ : పఞ్జరికా, స్త్రోమః. వ్యా:- (1) శోణగర్భకస్థరఞ్జకవస్తు. (2) అవయవాధారధాతుః వా మూలధాతుః, అఙ్గనిర్మాణకాధారధాతుః వా మూలధాతుః. తె. అవయవనిర్మాణాధారధాతువు.

Structure : నిర్మితిః, వ్యూహనమ్, రచనా. తె. కట్టడము, నిర్మాణము. the composition of an organ. అఙ్గవ్యూహనమ్. తె. అవయవనిర్మాణము. an organ. అఙ్గమ్, అవయవః. కరణమ్. తె. అంగము, అవయవము, కరణము. Structures. అఙ్గాని, అవయవాని. తె. అవయవములు, ధాతువులు, ప్రత్యంగములు.

Accessory S : ఉపాఙ్గాని.

Cell S: కణనిర్మాణములు, కోశవ్యూ

హానములు.

Different S. of the body: వివిధదేహావయవ నిర్మాణాని. తె. వి. శరీరమునగల వివిధావయవముల నిర్మాణము.

Minute S: సూక్ష్మాఙ్గాని. తె. శరీరమునగల మిక్కిలి చిన్న అవయవములు.

Ovarian S: అణ్డాశయస్నాయుతన్తువ్యూహానాని.

Secondary S: ఉపధాతవః. తె. ఉపధాతువులు. వి. రసరక్తాది ధాతువులనుండి పుట్టు పాలు, ఋతురక్తము, కండరములు, క్రొవ్వు, పళ్లు, సిరలు, స్నాయువులు మొదలగునవి.

Structurless S: నిరవయవాః (కలాః). తె. కలలు, పొరలు.

Sub: beneath, under. అధః, అధర, అను. తె. క్రింద, క్రింది.

S. clavian: అధోజత్రూకా.

S. coracoid: అంసతుణ్డాధర.

S. cutaneous: అధస్త్వక్, త్వగధర. తె. చర్మముక్రింద.

S. division: secondary or small division. ఉపాంగమ్, ప్రత్యఙ్గమ్. తె. చిన్న అవయవము.

S. glenoid: ఉదూఖలాధర.

S. lingual: అధోజిహ్వ, జిహ్వాధర. తె. నాలుకక్రింద.

S. mental: చిబుకాధర. తె. గడ్డముక్రింద.

S. mucosa: the connective tissue beneath a mucosa. సంయోజకధాత్వధరకలా.

S. spinosus: అంసవంశాధర.

S. tendinous: కణ్డరాధర.

Subsidary members: ప్రత్యంగాని.

Substance ద్రవ్యమ్, వస్తు. తె. ద్రవ్యము, దినుసు, వస్తువు.

Cement Su: సుబన్ధకవస్తు, సంయోజకధాతుః. వ్యా :- శ్లేషకధాతుః.

Gray Su: ధూసరవస్తు. వ్యా :- మస్తిష్కస్య ధూసరాంశః.

Liquid Su: ద్రవద్రవ్యమ్.

Nuclear Su: karyoplasm. నవక్రియావస్తు.

Solid Su: ఘనద్రవ్యమ్.

White Su: ధవళద్రవ్యమ్. వ్యా:- మస్తిష్కస్య ధవళాంశః.

Substantia: substance ద్రవ్యమ్, వస్తు.

S. alba: శ్వేతవస్తు. the cerebral and spinal white matter. పృష్ఠవంశ్యమాస్తిష్క-ధవళ ద్రవ్యమ్.

S. cinerea: the cerebral and spinal gray matter ధూసరవస్తు. వ్యా :- మాస్తిష్క్యాదీషు ధూసరద్రవ్యవిశేషః, భస్మవర్ణ ద్రవ్యమ్.

S. compacta: కర్పరః. వ్యా: అస్థ్నః ఘనాంశః. ఏషహాస్థిదస్తవ

న్నిబిడస్సన్ అస్థిబహిర్భాగేద్యశ్యతే. తె. కర్కూరము. వి. ఇది ఎముకల గట్టి భాగము, బయటి కనుపడును.

S. gelatinosa . వాసీయవస్తు. వ్యా:- అవలేహ్యసంలగ్నశీల సాన్ద్రి శ్వేతవస్తు.

S. grisea - see cineria.

S. nigra · నీలవస్తు.

S. spongiosa : పేలవః. వ్యా :- అస్థ్నః వివరలాంశః, పిఞ్జికాకారః. ఏష అస్థ్యన్తర్భాగే మధితిష్ఠతి.

Subtile : (1) అణుకః. అతిసూక్ష్మః (2) కుశాగ్రబుద్ధిః, సూక్ష్మదర్శీ.

Succus: juice. రసః. తె. రసము.

S. entericus : the intestinal juice secreted by the intestinal glands. ఆన్త్రరసః. వ్యా:- ఆన్త్రగ్రన్థిభ్యః నిస్సృతో రసవిశేషః. తె. ఆన్త్రరసము, ప్రేగురసము. వి ప్రేగులలోని బుడిపెలలో నూరు రసము.

S. gastricus: the gastric juice. జాఠరరసః.

Sugar : మధురః, శర్కరా, సితా. తె. తీపి, పంచదార, చక్కెర.

Sulcus : a furrow or groove. సరిత్కా. వ్యా:- శరీరశ నిమ్నఖాతః దీర్ఘరేఖా రూపేణ ఖనితా సీతా, కుల్యా, తె. పల్లమైనగీత. వి. ఇది నాగేటిచాలువలె నుండును, లోతు గీత.

Antero lateral Sul : అగ్రిమ పార్శ్వగా కుల్యా, అగ్రిమే సీతే, పార్శ్వగే కుల్యే, పురస్తన బాహ్య సరిత్కా.

Calcarine Sul : (fissure) : కార్కూర సరిత్కా.

Callosomarginal Sul : శైఙ్గుల (లీ) సరిత్కా.

Carotid Sul : కారోటసరిత్కా.

Central Sul - see sul centralis.

Cingulate Sul : శైఙ్గుల సరిత్కా.

Circular Sul - see sul. centralis.

Collateral Sul . అనుపార్శ్వ సరిత్కా.

Crucial, cruciforin Sul : స్వస్తిక సరిత్కా.

Interior petrosal Sul : అధర ప్రాస్తరసరిత్కా.

Intertubercular Sul : అర్బు దాన్తరసరిత్కా.

Intertubular Sul : ద్వ్యమూల కుల్యా.

Intraventricular Sul : కోష్ఠ కాన్తరసరిత్కా.

Lacerum Sul : రేఖాదీర్ణసరిత్కా (రన్ధ్రిమ్).

Lateral cerebral Sul : బాహ్య మస్తిష్కసరిత్కా.

Limitanus, Limiting Sul . సీమసరిత్కా.

Median Sul : మధ్యమసరిత్కా.

Occipital Sul . పశ్చాత్కపాల సరిత్కా.

Parieto-occipital Sul : పార్శ్వ పృష్ఠకీయసరిత్కా.

Posterior median Sul: పశ్చిమ మధ్యమసరిత్కా.

Postero intermediate Sul: పశ్చిమావాన్తరసరిత్కా.

Postero lateral Sul : పశ్చిమ పార్శ్వగా కుల్యా, పశ్చిమబాహ్య సరిత్కా.

Rhinal Sul : ఘ్రాణసరిత్కా.

Subarachnoid Sul : బ్రహ్మోద కుల్యా.

Subparietal Sul : పార్శ్వకాధర సరిత్కా.

Sul. basilaris : మౌలికసరిత్కా.

Sul. calanei : పార్ష్ణిసరిత్కా.

Sul. centralis : మధ్యమసరిత్కా.

Sul. circularis : వృత్తసరిత్కా.

Sul. limitans insulae : వృత్త సరిత్కా.

Sul. Monro, Monro's Sul : మన్ద్రిసరిత్కా.

Sul tali : గుల్ఫసరిత్కా.

Sul. triradiate : the orbital fissure - see fissure.

Sul. tympanicus : the tympanic membrane groove. మధ్య కర్ణపటహ సరిత్కా.

Tubae auditivae transverse Sul : తిరశ్చీనసరిత్కా.

Sulfur - see sulphur.

Sulphur : షట్బ్వరమ్, గన్ధకమ్. తె. గంధకము.

Summit : అగ్రమ్, మూర్ధా, శిఖరమ్. తె. కొన, శిఖరము, శృంగము.

Supercilium: the eyebrow. భ్రూ, భ్రువౌ (ద్వి). తె. కనుబొమ, కను బొమలు.

Superficial : బాహ్యః. తె. ఉపరి భాగసంబంధమైన, పై, పైపై, బాహ్య మైన.

Superficialis : a superficial artery or muscle - see artery and muscle.

Superior : ఉత్తర, ఊర్ధ్వ, అధిపతి.

Supination : ఉత్తానీకరణమ్. తె. వెల కిల జేయుట, వెలకిల పరుండుట.

Supra: above. అధి, ఉత్తరా, ఉపరి. ఊర్ధ్వా. తె. మీద, మీది, పై.

S. renal : above the kidney. అధివృక్కః.

S. sternal : above the sternum. కణ్ఠకూపః, కణ్ఠకూపకః.

S. trochlear : అధిచక్రక.

S. ventricular : అధినిలయ.

S. vesical : అధివస్తి.

Sura· calf of the leg. జంఘాపిణ్డికా. తె. పిక్క-కండ, పిక్క-మాంసము. వి. పిక్కలోని మాంసపు ముద్ద.

Surface : ఉపరితలమ్. వ్యా:- విస్తీర్ణాకారస్యాభావికో దేహదేశః, ఉపరిభాగః, ఉపరితలమ్. తె. ఉపరితలము, ఉపరిభాగము, పై, మీదు, బయటి.

Anterior S : పురస్తలమ్, పురోభాగః.

Anterior S. of the cornea : కృష్ణపురస్తలమ్, కృష్ణమణ్డలమ్.

Articular S : సన్ధేయతలమ్.

Auricular S: కర్ణతలమ్, త్రికర్ణః. వ్యా·- కర్ణస్యోపరిభాగః.

Auricular S. of ilium : శ్రోణీకర్ణః.

Caudal S : పౌచ్ఛతలమ్.

Cerebral S : మాస్తిష్కతలమ్.

Concave S : ఉదరమ్, మధ్యానతతలమ్.

Convex S : మధ్యోన్నత తలమ్.

Costal S : పర్శుకాతలమ్.

Cuboid articular S : ఘనీయతలమ్.

Dorsal S : పశ్చాత్తలమ్, పృష్ఠ్యతలమ్.

External S : బహిస్తలమ్.

Facial S : మాఖికతలమ్.

Facial S. of sup. maxilla : హన్వోర్ధ్వ ముఖ్యతలమ్.

Flat level S : ఫలకాకం తలమ్.

Frontal S : (మధ్యస్థ) లలాటతలమ్.

Gastric S : జఠరాభిముఖతలమ్.

Inferior S . అధస్తలమ్.

Internal S: అన్తరతలమ్, అన్తస్తలమ్.

Jugular S : గ్రైవతలమ్.

Lateral S : పార్శ్వతలమ్, త్రికపార్శ్వతలే, గాత్రపార్శ్వతలే. వ్యా:- బాహ్యతలమ్.

Lunate S : అర్ధచన్ద్రతలమ్.

Maxillary S : నాసిక్యహనవ్యతలే.

Medial S : ఆన్తరతలమ్, మధ్యతలమ్.

Opposed S : ప్రతిద్వన్ద్వతలమ్.

Orbital S : అక్షికుణ్డీయాధస్తలమ్, నేత్రపీఠతలమ్.

Outer layer S. of the cranium - see papillary layer.

Palmar S - see volar S.

Patellar S : జానుతలమ్, పాటలా(ఖ్య) తలమ్.

Planter S : పాదతలమ్. తె. అరికాలు.

Popliteal S : జాను పృష్ఠ్యతలమ్.

Posterior S : పశ్చిమ తలమ్, పశ్చాత్తలమ్.

Posterior articular S : పశ్చిమగౌల్ఫసన్ధేయతలమ్, పశ్చిమసన్ధేయతలమ్ (లాఞ్ఛనమ్)

Pelvic S : శ్రోణికోష్ఠపురస్తలమ్.

అధరోదరపుర స్తలమ్.

Superior S : ఉత్తరతలమ్, ఊర్ధ్వ తలమ్.

Temporal S : శ (గా) ఖతలమ్

Temporal S of great wing of sphenoid : స్ఫీనకాస్థి బృహత్పక్ష శాఖతలమ్.

Trochlear S : గుల్ఫాస్థిడమరుతలమ్.

Upper S : ఉపరితలమ్.

Upper S of the skull : కరోటి పీఠమ్, మస్తిష్క పీఠమ్.

Ventral S : ఉదరమ్, ఉదర్య తలమ్, పదప్యుదరభాగః.

Volar S : పాణితలమ్. వ్యా :- పాణౌ యదరమ్.

Zygomatic S : గణ్డోత్తరతలమ్.

Sustentaculum tali. గుల్ఫస్తమ్భకః.

Sutura - see Suture.

Suture : line of junction of adjacent cranial or facial bones.

Boney sutures : సన్ధిః, సీమన్తాః, సీవనీ, సేవనం, తున్నసేవనీ. a stitch. సీవనమ్. తె (1). అతుకు, కుట్టు, సంధి. (2) సీమంతము. వి. తల ఎముకల కలయికచే నేర్పడిన రంపపుపళ్లవంటి చార. ఇవి పలు తెరగులు.

Basilar Su : మూల జాతూక సీమన్తః.

Coronal Su, Coronary Su : పురస్సీవనీ, పురస్తనసీమన్తః. తె.వి. పుర్రెపైగల ప్రక్క సంధి.

Crucial Su : స్వస్తిక సీమన్తః, స్వస్తిక సీమన్తికా.

Ethmofrontal Su : ఝర్ఝరలలాట సీమన్తః.

Ethmolacrimal Su : ఝర్ఝరాశ్రవీయ సీమన్తః.

Ethmosphenoid Su : ఝర్ఝర జతూకాస్థి సీమన్తః, ఝర్ఝరస్ఫీనకీయ సీమన్తః.

Frontal Su : లలాట సీమన్తః.

Frontomalar Su: లలాట గణ్డకా సీమన్తః.

Frontomaxillary Su : లలాట హానవ సీమన్తః.

Frontonasal Su : లలాటనాసిక్య సీమన్తః.

Frontosphenoid Su : లలాట స్ఫీనకీయసీమన్తః.

Fronto temporal Su : లలాట శాఖ సీమన్తః.

Inter maxillary Su : హను మధ్యగ సీమన్తః.

Internasal Su : నాసామధ్య సీమన్తః. వ్యా :- నాసామధ్యాస్థిష్వ సన్ధిః.

Interpalatine Su : తాలుమధ్యగ సీమన్తః.

Inter parietal Su : see sagittal Su :

Jugal Su - see sagittal Su:

Lamboid Su suture between the parietal and occipital bones. పశ్చిమ సీమన్తః, పశ్చిమ కపాల పార్శ్వక సంధిః. పశ్చాత్ కపాల పార్శ్వకాస్థిసీమన్తః. తె. వి. పుఱ్ఱెఎముకల ప్రక్కఎముకల అతుకు.

Malatemporal Su: గణ్డశాఙ్ఖ సీమన్తః. వ్యా:- శఙ్ఖాస్థి గణ్డమధ్యస్థ సీమన్తః.

Maxillolacrimal Su: హన్వాశ్రవీయ సీమన్తః.

Metopic Su, Frontal Su: హన్వాశ్రవీయసీమన్తః.

Metopic Su, frontal Su: గూఢసీమన్తికా, పురస్సీమన్తః, లలాటసీమన్తః.

Nasomaxillary Su: నాసికాహానవసీమన్తః. వ్యా - నాసికాహనుమధ్యాస్థిసీమన్తః వా సన్ధిః.

Occipital Su - see lamboid Su.

Palatine Su: తాల్వస్థిసీమన్తః. వ్యా:- తాల్వస్థిమధ్యగసన్ధిః.

Palatomaxillary Su: తాలూర్ధ్వహానవసీమన్తః. వ్యా:- తాల్వూర్ధ్వహన్వోర్మధ్యస్థసన్ధిః వా సీమన్తః.

Parietomastoid Su: పార్శ్వకచూచుకసీమన్తః. వ్యా:- పార్శ్వకాస్థిచూచుకఖండసన్ధిః.

Parietotemporal Su: పార్శ్వసీమన్తః, పార్శ్వశఙ్ఖాస్థ్నః సన్ధిః.

Petro occipital Su: ప్రాస్తరపశ్చాత్కపాలసీమన్తః.

Petrosphenoid Su: ప్రాస్తరస్ఫానకీయసీమన్తః.

Petrosquamous Su: సంయోగాఙ్కరేఖా (సీమన్తః).

Sagittal Su: ఆతానికసీమన్తః, మధ్యసీమన్తః, సాయకసీమన్తః, పార్శ్వక కపాలాన్తరసన్ధిః, వా సీమన్తః. వ్యా:- ఏషసీమన్తః బాణ ఇవ వా శరఇవ వర్తతే. తె. బాణము వలె నుండు అతుకు, కుట్టు.

Sphenoidal Su: ఆవర్తసీమన్తః, స్ఫానకీయసన్ధిః వా సీమన్తః.

Sphenomalar Su: స్ఫానగణ్డక సీమన్తః.

Sphenoparietal Su: స్ఫాన పార్శ్వకసీమన్తః.

Sphenotemporal Su: స్ఫాన శాఙ్ఖసీమన్తః.

Squamosal Su: శాకలసీమన్తః.

Squamoparietal Su: శాకల పార్శ్వకీయసీమన్తః.

Squamosphenoid Su: శాకల స్ఫానకీయసీమన్తః.

Su. of the bones: అస్థిసీమన్తః, అస్థిసన్ధిః, అస్థిసీవనీ.

Su. of the skull: శిరస్సీమన్తః.

Su. harmonia: సమసీమన్తః.

Su. schindylesis: గ్రస్తసీవనీ.

Temporal Su : పార్శ్వసీమన్తా.

Transverse facial Su : తిరశ్చీన ముఖసీమన్తః.

Zygomatic maxillary Su : గాణ్డహానవసీమన్తః. వ్యా :- గాణ్డహానవ్యస్థిమధ్యస్థసన్ధిః వా సీమన్తః.

Sweat : the secretion of the sodoriferous glands. ఓజఃస్థానమ్. తేజఃస్థానమ్, (శ్లేఽః). ఘర్మః, ప్రస్వేదః, స్వేదః. తె. చెమట. స్వేదము.

S. ducts - see duct.

S. glands - see gland.

Swelling : అర్బుదమ్, ఉత్సేధః. శ్వయథమ్. (1) ఉబ్బరము, ఉబుకు, ఉబ్బు, మిట్ట. (2) ఎత్తు, వాపు.

Symmetry: harmony. సమాకారః. తె. పొందిక, సౌష్ఠవము. a harmonious correspondence of parts. అంగసంయోగః, అవయవ సంహతిః. తె. అవయవపొందిక, అంగసౌష్ఠవము?

Sympathetic : అనుకమ్పాయ, అనుతాపీయ, సంవేదనీ, సమవేదన.

S. nerve fibre-see fibre.

S. nreve - see nerve and nervous system.

S. nervous system - see system.

S : nerve trunk - see trunk.

mpathoblast - see blast.

Sympathochromaffin : అనుతన్త్రిక్రమస్ఫీనః.

Sympathochromatic cell : అనుతన్త్రిక్రమస్ఫీన కలకమ్.

Symphysis : a junction of bones. అస్థిసన్ధానమ్, సమస్ఫీతిః. తె. ఎముకల యతుకు. కూడలి, సంధి.

S. menti : చిబుక సమస్ఫీతిః, చిబుక సన్ధానికా.

S. pubis : భగసమస్ఫీతిః. వ్యా :- భగాస్థి సన్ధిరేఖా, జఘనసన్ధానికా.

Synarthrodia : synorthrosis. an immovable articulation. త్రికఫల సన్ధిః, స్థిరసన్ధిః. తె. కదలని కీలు, తిరుగని కీలు.

Syncytium : సమసత్త్వికా.

Syndesmology : the scientific study of the ligament, the sciencc of the ligaments. స్నాయుప్రకరణమ్, స్నాయువిజ్ఞానమ్, స్నాయుస్కన్ధః.

Synosteology : the science of the joints. సన్ధిప్రకరణమ్, సన్ధిస్కన్ధః, సంధివిజ్ఞానమ్. తె. కీలుకు చెందిన శాస్త్రము; విజ్ఞానము.

Synovia : సన్ధిశ్లేష్మ, శ్లేష్మస్నేహః, శ్లేషక, శ్లేషకశ్లేష్మ. వ్యా :- సన్ధిస్థిత స్నేహద్రవ్య విశేషః. తె. కీలు కఫము, కీలుచమురు. వి. కీళ్ళయందుండు కఫము, చమురుగా పని చేయును, కండెన.

